శ్రీరస్తు

రామానందగురుబ్రహ్మణే నమః

శ్రీమద్వినుకొండ పురవరాధీశ్వర సీతారాఘవేశ్వరచరణకమలసేవానిరతుండును
శ్రీరామానందయోగీశ్వర ప్రియశిష్యుండును సంగీతసాహిత్యవిద్యా
ప్రవీణుండును మార్కండేయగోత్రపవిత్రుండగు

శ్రీమత్కొండికంటి వెలిగొండదాసునిచే

భక్తిజ్ఞానవైరాగ్యములను బోధించునట్లుగా రచియింపబడిన

# జ్ఞానానందసుబోధిని.

ఈ గ్రంథము శ్రీమదుభయవేదాంతప్రవర్తకులగు
శ్రీమాళ్లప్పాడవటికంటి తిరుమలరామానుజాచార్యులవారిచే
పరిష్కరింపబడి

శ్రీ॥ గుడివాడ వెంకట నరసింహముగారిద్రవ్యసహాయమువల్ల

వాణీముద్రాక్షరశాలయందు
ముద్రింపబడియె.

బెజవాడ

1900



శ్రీరస్తు

శ్రీ రామానందగురవే నమః

# జ్ఞానానందసుబోధిని.

## ఉత్పలమాల.

శ్రీసముదారమంచితమచింత్యమనంతమమేయమవ్యయం। బైసచరాచరసృష్టికృతికాదియుమధ్యమమంతముఁగా మహా। భాసురలీల జేయుచు స్వభక్తులబ్రోవఁగ రామయోగిహృ। ద్వాసితదివ్యతత్వమయిభాసిలునక్షరముంభజించెదన్॥

## కందము.

ఘనపూర్వజలధితీరం- బుననొకపురమమరువంగవోలనుపేరన్। దనరా-రునందుగలఁడొక- డనగుడుతద్దివ్యకథమహాత్ములువినుడీ॥

## ఉత్పలమాల.

శ్రీనలినోద్భవుండమరసేవ్యుడుసచ్చరితుండుబ్రహ్మదా। మానసమందుగాంచెఘనమానసులన్ సనకాదులన్ మహా।నూనతపోబలాన్వితులనొయ్యనతత్సనకుండుగాంచెశ్రీ। సానకగోత్రముందురితజాలపవిత్రమునాత్మశక్తిచేన్॥

## ద్విపద.

ఆమహాంధువాదివ్యగోత్రవారాసి। హిమకరుండనుబోలి నెలమిజన్మించె। అక్షయాచార్యుడాస్యాహ్లాదకరుడు। లక్ష్మీకరుడు దేసులక్ష్మణాఖ్యుండు। ధరవిశిష్టాద్వైతతత్వసంవేది। పరమార్థదివ్యవిజ్ఞానభాసురుడు। పరతంత్రిసముదారభక్తియుక్తుండు। గురుతరద్వయనైష్ఠికోల్లాసశీలు। డామహాత్మునికాంతయగణితస్వాంత। భామాజనస్తోత్రపరమపవిత్ర। శ్రీపిచ్చమాంబయన్ జెల్వొందుసాధ్వి। కాపూర్ణపూర్వపుణ్యాధికంబునను। అరలేనిమతి వెంకటప్పయ్యశ్రేష్ఠి। నెరిధర్మశీలుడౌనిలబాలిశ్రేష్ఠి। మననసంభోగి రామానందయోగి। అనఘుండునుదయవర్ణనపుణ్యశాలి। రాజితాచారుండు రామానుజయ్య। భ్రాజత్కృపాశాలి వరదరాజయ్య। పరతత్వసంవేది పార్థసారథియు। పరధర్మయుతుడును బ్రహ్మణ్యశ్రేష్ఠి। యననొప్పనెనమండ్రునాత్మజులందు। ఘనుడు రామానందఘనయోగివరుడు॥

సీసము.

యమనియమాసనాద్యష్టాంగసహితుండుషట్చక్రయుతమర్మసంవిదుం
డు। చిరసదాశివయోగచిన్మయానందుండుగురుసేవనారూఢగూఢమతుడు।
పరమవైరాగ్యసంభరితసుస్వాంతుండునిర్మలాంతర్వీక్షణీయుతముడు। సక
లఘాతవ్రాతసమదివ్యచిత్తుండుమోక్షభామామనోమోహనుండు। రాజి
తాష్టాక్షరీమంత్రరాజపరుడు। నిర్వికల్పసమాధిలోనెగమువాడు। సంచితా
జన్మహారికళాసంగతుండు। సాంద్రకరుణుండురామయోగీంద్రగురుడు॥

చంపకమాల.

పతితులపావనాత్ములుగదాగొనరించెడువేడ్కఁగల్గియా। శ్రుతగిరిజేరి
యుండగయశోనిధివెంకటనారసింహుడన్। హితమతితత్సుధీవరుభజించిత
రించియునమ్మహాత్మునం। గతిగలిగించెనాకతనిగౌరవవంశమునన్నుతించె
దన్॥

ఉత్పలమాల.

శ్రీయరవిందగర్భముఖసేవితచారుపదాబ్జుడైననా। రాయణదివ్యనా
మకపరాత్పరదాస్యసుహర్షియైనమై। త్రేయమహర్షి గాంచెసముదీర్ణయ
శోవిభవంబువిస్ఫుర। న్యాయముదాత్తముంమిథునానామకగోత్రముసత్పవి
త్రమున్॥

ఉత్పలమాల.

ఆగరిమందవర్ప్యమిథునాన్వయమందుజనించెనీతివి। ద్యాగుణశాలిద
క్షుతుకాత్మకుడచ్యుతభక్తిపూర్ణుడ। భ్యాగతశేవకుండుగురుపాదసరోరు
హచంచరీకుడై। శ్రీగుడివాడవేంకటవిశిష్టుడనన్ధరణీస్థలంబునన్॥

ఉత్పలమాల.

ఆగుడివాడవేంకటవరాఖ్యునకున్దగుకోటమాంబకున్। సాగరజప్రస
న్నకన్యలకుచంద్రునిబోలిజనించెనిత్యస। త్యాగమధర్మమార్గగమనానుగుణుండ
నఘుండుదానసం। భోగధనుండుమానధనపూర్ణుడువేంకటసామియైధరన్॥

ఉత్పలమాల.

అంబరవాహినీగురునకబ్జవిహారిణియైనలక్ష్మికిన్। శంబరవైరిబోలిబుధ
సన్నుతివెంకటసామికాదిల। క్ష్మాంబకుపుత్రుడయ్యెసదయాత్మకుడాశ్రిత

వత్సలుండుసీ। తాంబరపాదభక్తిభరితావిరతాచరితాత్మురైమహాన్॥

ఉ త్ప ల మా ల.

శ్రీగరుడధ్వజాంఘ్రియుగసేవకుడంచితపుణ్యశాలిది। వ్యాగమధర్మవర్తిసముదంచితకీర్తిదయాపరిపూర్తిసీ। తాగజగామినీవిభుడుదారవితీర్ణసుధార్ణవుండునై। శ్రీగుడివాడవేంకటనృసింహుడుపోల్చెధరాతలంబునన్॥

సీ స ప ద్య ము.

సరిలేనిగురిబూనిపొరబోనిభక్తిచేశ్రీరామయోగీంద్రుజేరినాడు। సాధుపరిమోదప్రసాదనాంబువులచేమించుకూపములత్రవ్వించినాడు। పొలుపొందువలపందగలపుష్పఫలములంజెలువైనవనులస్పృషించినాడు। బలుపాపములరూపములబాపివెలుగొందుశ్రీకపీంద్రునిబ్రతిష్టించినాడు।బుధకవీంద్రార్థిజనములబోచినాడు।అట్టిగుడివాడవంశామృతాబ్ధిచంద్రు। డైనవేంకటనరసింహునభినుతింప। నకటనాబోటిసామాన్యులకువశంబె॥

మ త్తే భ వృ త్తం.

అలవేంకట్నరసింహధీవరుడుభవ్యస్ఫూర్తికీర్తింగనెం। బలునీతుల్వరియింపుమున్ పతినిదైవంబంచుసేవింపుచున్, కలితాభ్యాగతదృష్టిజేయుచుకులోక్తాచారముల్బూనుచున్। దలపంబోలనిపుణ్యసాధ్వియగుసీతాంబామణీభక్తిచేన్॥

గీ త ప ద్య ము.

ఆదయాకరుడొక్క-నాడనఘరామ। యోగికంకితముగనీవురాగతాళిక లితముగనొక్క-కృతిజేసిఘనతదీయ। వరకృపాపెన్నిధానంబువడయుమనిన॥

గీ త ప ద్య ము.

గృహమునకునేగితత్కా-లకృత్యములను। సలిపియేనెట్టిగ్రంధంబుసలుపవలయు। గ్రంధమునకేమినామంబుగాలవలయు।ననుచునారాత్రినిద్రించునవసరమున॥

సీ స ప ద్య ము.

మునుమున్నమౌనవెన్నదినమున్నతివహించుసదమలబ్రహ్మతేజంబువాడు। నిరతంబుదురితంబుత్వరితంబులోద్రుంచునాగబెత్తముచేతనలరువాడు। శరణొందునరునందుపరునొందగాజేయుఘనతపశ్శక్తిచేనెనయువాడు।ధృ

వమైయుభవమైయలవమైప్రకాశించునానందమునవోలలాడువాడు। రామ యోగీంద్రవర్యుండురమణనాదు। స్వప్నమునవచ్చినీసత్ప్రబంధమునకు। మ త్సహాయంబుగల్గునిర్మలుడవగుదు। వవ్యయానందమొందెదవనుచుబలికె॥

కందపద్యము.

జ్ఞానానందసుబోధిని। గానీగ్రంధముకుపేరుగావింపుమునీ। మానసము
నన్నుజేర్చుము। హీనపదమునందుసౌఖ్యమందుమువత్సా॥

సధివచనం.

ఇట్లనుగ్రహించిన యమ్మహానుభావుని దివ్యశాసనంబుశరీరంబునం దాల్చి సూర్యోదయంబునకుమున్నమేల్కాంచి యెనమ్మహాయోగివర్యుని సన్నిధానంబునకుజనుదెంచి శరణాగతుండనై సేవించి పరతత్వోపదే శంబువహించి సుఖించి తన్నామాంకితంబుగా గ్రంథంబురచించుటకు నా రంభించి మదీయవంశావతారక్రమంబువిన్నవించెద॥

కవివంశానుక్రమం—ద్విపద.

శ్రీభర్తయైవిలసిలుమహావిష్ణు। నాభికమలమందునలువజన్మించె। నత
నికిమతియొందునలఘుయశుండు। ధృతివంతుడగుకుత్సబుషియుదయించె।
ఘనుడాతనికిగల్గెకలుషదూరుండు। ననితేజుడామృగశృంగసన్మౌని। సరసు
డానమ్మునిసార్వభౌమునకు। నరిదిపుత్రుండయ్యెనలమృగండుండు। నతనికి
భగవత్పదాబ్జసేవ్యుండు। మతిమంతుడైయొప్పెమార్కండమౌని। గురుడా
తనికిహేమగుండంబునందు। మురువుతోభావనామునిజనియించె। నతనిచే
వంశంబునభివృద్ధిజయ్యె। క్షితిజనస్తుతమునైచెన్నొందిమిగుల॥

గీతపద్యము.

అందుశ్రీకోడిగంటివంశామృతాబ్ధి। పూర్ణచంద్రునిబోలియీభువిజ
ణించె। పరమసుగుణుండుసాధుసంభావితుండు। శీలుడలఘుండుబంగారుశె
ట్టిఘనుడు॥

సీసపద్యము.

శీలుడౌబంగారుశెట్టియాశ్రీవెంకటాంబయందునుగాంచెనలఘుయశు
ల। చెలువుగాకొండయ్యచిన్నయ్యయనువారినందులోచిన్నయ్యకతివయైన।
శ్రీనాగమాంబనజెలగుపతివ్రతాగర్భమందుజనించిగౌరవమున। వన్నెకె
క్కినయట్టివనజాక్షుభక్తితోనలరుచుండుదుమందునగ్రజుండు। వరనృసిం
హుండువెలిగొందుబాలకొండు।అందురెండవపుత్రుండహరిపదాబ్జ।దాస్య

సంగతకవితానిధానుడనగ। నవనివెలిగొండదాసుండనైననేను॥

వచనము.

సద్గురుండైన శ్రీరామానందబ్రహ్మయోగీంద్రులవారికృపవల్ల నే జేయుబోవు జ్ఞానానందసుబోధినియందు శృంగారతత్త్వపదములనాకర్ణించివినుడీ॥

అయ్యలారా!

సీసమాలిక.

శ్రీసద్గురుండైనశ్రీరమాధీశ్వరు పాదసేవకుడనుబంటనయ్యా। గిరులందుగుహాలందుచరియించుఘనులకే పాదసేవకుడనుబంటనయ్యా। అష్టాంగయోగంబులభ్యసించినవారిపాదసేవకుడనుబంటనయ్యా। పంచముద్రిలలోనిభావమెరిగినవారి పాదసేవకుడనుబంటనయ్యా। రాజయోగముచేనిరంజనులౌవారిపాదసేవకుడనుబంటనయ్యా।గతమనాగతమునుగనుగొన్నవారికెపాదసేవకుడనుబంటనయ్యా। మహిమతాచారాదిమర్మముల్గనువారిపాదసేవకుడనుబంటనయ్యా। వాదభేదములేకమోదమొందెడువారిపాదసేవకుడనుబంటనయ్యా। తనువస్థిరంబనితరచిచూచెడువారిపాదసేవకుడనుబంటనయ్యా। కలియుగంబుననున్నకవిజనాదులకునేపాదసేవకుడనుబంటనయ్యా।సకలశాస్త్రంబులుచదివిచెప్పెడువారిపాదసేవకుడనుబంటనయ్యా। సరసపురాణాదిసంజ్ఞలరసినవారిపాదసేవకుడనుబంటనయ్యా। గానేజేయునట్టి ఈగ్రంథమందు॥తప్పులున్ననుగురుభక్తితత్త్వమాట।నేనుశరణాగతుడనగుట . . . గాంచి। యతులకృపచేతమన్నించుడయ్యలారా॥

శ్రీరాగము అటతాళము

రామానందయోగీశ్వరా। నన్నురక్షించుమికపరమేశ్వరా। పామరుడనునరపశువనదగునేన్ను- తామసమెంచకదయజూచిబ్రోవుము। కామకలుషవిరాముడవనుచుగనిబుధోత్తములెల్లమదినీ। నామమేగతియనిముదంబున నమ్మిసద్గతిబొందిరటశ్రీ॥రామా॥

తల్లిదండ్రినీవేయంటిరా। వేరేదైవములేదునాకంటిరా। కల్లసంసారాంధకారములోజిక్కి-తల్లడింపుచునీదుదరిజేరివేడితి। తొల్లిప్రహ్లాదాదిభక్తులకెల్లదర్శనమిచ్చిమదిరం। జిల్లజేయుచునెప్పుడుకదలకయుల్లముననిలచి నావటశ్రీ॥రామా॥

భక్తవత్సలుడనివింటిరా। నన్నుపాలించనీవెదిక్కంటిరా।రక్తదుర్మాం

సమూహాత్రిదిక మైనయా। యుక్త దేహమునందాసక్తుడనైయుండి। ముక్తిదా యకనిన్ను నెరుగక మోసపోయితినాకు చేలుని। భక్తిగని మోక్షంబొసంగిన పరమపురుష ముకుందహరి శ్రీ॥ రామా॥

పతితపావనుడనివింటిరా। నీవేగతియని నే మ్రొక్కుచుంటిరా। అతిథినా శించినయన్నమిడక క్రోధమతిచే వర్తించెదుర్మతుడనౌనన్నుయే। గతినిజా తువాకరిమకరిచే గాసినొందుచు వేడమకరిని। హతమొనర్చియు వేగకరిమది హర్షమును బొందజేసిన శ్రీ॥ రామా॥

దాసపోషకుడవటంటిరా। నీదుదర్శనమును గోరుచుంటిరా। భాసుర మాయచే పట్టుపడియు నెంతో వేసారి వెలిగొండ దాసుడనై వేడ। వాసవార్చి తధాసమానవిలాసవందిత దాసచిత్తని। వాసిగ్నైశ్రితగిరిని నెపుడు వికాసమ తినిలచినావట శ్రీ॥ రామా॥

కందార్ధం          ముఖారి

ఎందెందుననీవేయని। సందేహము వదలినీదుజాడ దెలసియా। నందము బొందెడివారికి। ముందైనిలచినీవున్న। ముచ్చటవింటి। నికయెందున మోస పోనంటి। పొందుగ శ్రీ రామానంద యోగీంద్రుడై। అందుయిందుభయం బులేదానందమొందితిననుచునీదగు॥ ముచ్చటవింటి॥

బేహగ్          అటతాళం

నన్ను బ్రోవానన్న నేను। యెవరివాడనౌదునయ్యా పన్నగశయన నేనిన్ను నామదిలోనసన్నుతి జేసితిరా। యింతకన్నడ సేయకుకరుణించిబ్రోవనీ దిక్కెవ్వరురా॥ నన్ను॥

ఎప్పుడునీసేవ నేమరకనుమది తప్పక జేసితిరా। నాతప్పులెంచకుము నా యొప్పులకుప్ప మాయప్పతప్పక రావేరా॥ నన్ను॥

కోరి ప్రార్ధించెడివారికి నెల్లను గురురూపమైనావురా। ముక్తిదారిజూపి నట్టిదైవమునీవనిదరి జేరి మ్రొక్కితిరా॥ నన్ను॥

భూతకోటికెల్ల ధాతవైనీవు ప్రఖ్యాతినిగొన్నావురా। సంప్రీతిగ నేవంక జూతమటన్న నచేతనమైనావురా॥ నన్ను॥

తల్లిదండ్రిగురుదైవమునీవని తలచి నే వేడితిరా। నీయుల్లములో నాపైచ ల్లనికృపనురంజిల్లజేయవేలరా॥ నన్ను॥

ముందునీ పాదారవిందములెపుడునాడెందము జేర్చితిరా। నేపొందుపర

చిమరువకుందునిన్నికదామానందయోగీంద్రవరా॥నన్ను॥

కుండలిశయనవినోర్కండవాసబ్రహ్మండనాయకుడవురా। నీవుదండిగ వెలిగొండదాసునిమదిలోనఖండమైయున్నావురా॥రామా॥

కందార్థం శంకరాభరణం

శ్రీలక్ష్మీశుడితండని। చాలగమదివేడుచున్నసద్భక్తులనే। పాలించెదననుచుకృపా। శీలుండైయున్నవాని॥ సేవించుమనా॥ నీకునుముక్తి సేకూరునన్నా। ఫాలభాగమునముమ్మాలకోలనులోన। నోలలాడుచునున్నయుజ్వలమూర్తిని॥ సేవించుమన్నా॥

శంకరాభరణం ఆదితాళము

నీసరిదైవమేదిరా॥ నీసరి॥ వాసవసుతసద్విలాసనిర్మలయోగ। భాసులనుదాసులనుబ్రోచేపరమేశ॥నీసరి॥

ధారుణినిన్నేపరదైవమనుచుమది। గోరిమొ్రక్కరాచేకోరాజాగేర॥ నీసరి॥

పన్నగశయననాభావములోపల। నిన్నువిడనన్నాయెందు। న్నావేడేనన్నా॥ నీసరి॥

అందముగారామానందయోగీంద్రుడ।వందుగనుగోందూదృఢమందుమదియందు॥ నీసరి॥

దండిగశ్రితగిరిధామశౌరివెలి। గొండాదాసుండామదినిండానీవేయండ॥ నీసరి॥

కందార్థం మోహన

యీరీతినిమదిలోనే। మారకపఠియింపుచున్నమనుజులకెల్లన్। చేరువసాయుజ్యంబని। కూరిమిబోధించురామ॥ గురువరుగన్నా॥ భక్తులకునేకొదవలేదన్నా। వారువీరనుభేదవాదములందువీ। చారమెరిగిముక్తిదారిదెలియువారు॥ గురువరుగన్నా॥

ముఖారిరాగం ఆదితాళం

రారానందకుమారా। ననురక్షించనునీవేరా॥ సారహీనసంసారజలధిదరి। జేరలేకపలుమారువేడెదను॥రారా॥

పతితపావనుడవంటి। నాగతినీవేయనుకొంటి। సతమనిదారాసుతులనుగూడుక। మతిచెడితినిసద్గతినొందించను॥రారా॥

ధరపోషకుడవటంటి। నీసరిదైవములేడంటి। స్థిరమనిదేహముగురుతెరు

గకనే। మరయుచుంటి శ్రీధరననుబ్రోవను॥ రారా॥

సుందరమూర్తివటంటి। దయజూడుమునాయెడనంటి। యెందుజూడ నందందునరామా। నందబ్రహ్మమై ముందునిలచుటకు॥ రారా॥

కుండలిశయనుడవంటి। ఘనుకొండవాసుడనగంటి। దండికృపను వెలిగొండదాసుమదినుండు పాపములు। చెండివేయగను॥ రారా॥

అర్ధకంబార్థం మోహన

ఘాతములకెల్లనీవే। ధాతయుదైవంబుసూత్రధారివైయెసం। ప్రీతిగ వాటాడించెదీ। ఖ్యాతిని నేనిపుడుమదిని। గంటిరా। నన్నిప్రడెబ్రోవామంటిరా। రాతిరిపగలునిరంతరమును భ్రమ। చేత రామగురుసేవలోనర్చుచు॥ గంటిరా॥

మాయామాళవగౌళ అటతాళం

నోములెన్నోనోచితినిగా। నాయాత్మలో శ్రీరామని న్నెనమ్మియుంటినిగా॥ కామమోహాదులును లేకనునీమముతోడుతనీసు। శ్యామసుందరదివ్యరూపము నేముదంబున గాంచుటకునై॥ నోము॥

సందియంబులబారదోలితిగా। సనకాదిసన్మునిబృంద సేవితుడనుచువింటినిగా। యిందునందునటంచుభేదమునొందకనుసచరాచరంబుల। నొందిభక్తుల డెందమున వెలుగొందుహరిగోవిందనీకై॥ నోము॥

భారకర్తవటంచువిందునుగా। నాభావముననీసారకీర్తిగణింపుచుందునుగా। సూరిజనమృదుమానసంబులకోరికలుదీర్చెదవటంచును। దారభిరుదాంకితుడవగుని చారుసత్కృపగాంచుటకునై॥ నోము॥

పూని నేనీస్మరణమాననుగా। శ్రీహనుమదాదిమహానుభావుల నేలువాడవుగా। తానునేనను భేదమును మదిలోనవిడచిసమస్తమునువి। జ్ఞానమతినీకళలటంచును ధ్యానమొనరింపుచునునీకై॥ నోము॥

ముందుగానే వేడుచుంటినిగా। నామదిలో రామానందయోగీశ్వరుడవంటినిగా। అందముగనాహృదయకమలమునందునీమృదుపదములెప్పుడు। బొందజేసియుమరువకనుయానందరూపము గాంచుటకునై॥ నోము॥

అంజనీవనిమ్రొక్కిజేరితిగా। శ్రితశైలపురవాసుండవగునిను జేరగోరితిగా। పుండరీకదళాక్షయీబ్రహ్మాండమెల్లనునిండుకొని వెలిగొండదాసుని బ్రోవ శ్రీకోదండరాముడవైననీకై॥ నోము॥

ఆదికంచార్ధం సురటరాగం

బృందావనలోలుడవని। ముందుగనీపాదకమలములుమరువకనా। డెందములోపలపరమా। నందముతోదలచిమ్రొక్కిరా॥ నార। యితరదైవముల మదిగోర। నీసేవకుపాత్రుడనూర। కరుణించిబ్రోవ నీవేరా। పొందుగరా మానందయోగివై। యెందుజూడనందంజెయున్నావురా॥ యితరదైవములమదిగోరా॥

బేగడ ఆదితాళం

నిన్నేనమ్మినవాడనని మొరవిడగ ప్రసన్నుడవుగావేమిరా॥ మున్నుసుజనులుప్రపన్నులై వేడగవిన్నపమాలించి వేగరక్షించిన। చిన్నికృష్ణనన్ను బ్రోవుమురా। నాదుష్కృతంబులనన్నిటినిపోజిమ్ముమంటినిరా। నివికనుదిక్కనియున్ననన్నికవేరుసేయకురా। నాయందుకృపలేకున్ననెవ్వరి వాడనాదునురా। మ్రొక్కెదనుయోఆపన్నరక్షక నీవుజగములనున్నజీవులకెల్లదొరవై। యన్నపానములిచ్చిసత్కృపనాదరించెటివాడవనినే॥నిన్నే॥

నందసుతుడవనినేనునీచరణారవిందముల్గోరితిరా। ముందుగోపకుల యానందముతోగూడి। బృందావనమునవింపొందుగనున్నగో। విందనేనీ ప్రాపుజేరితిరా। నాకిపుడుమోక్షమువొందగాజేయుటకునీవేరా। నీరూపమునుకనుగొందునిటుసాక్షాత్కరించుమురా। నీపాదపద్మములందునా మదిబొందజేసితిరా। సనకాదిమునివరవందితుండవునీవైయెందెందుజూచినగానిరామా। నందయోగీశ్వరుడవై వెలుగొందుచున్నపరాత్పరుడవని॥ నిన్నేనమ్మి॥

మారజనకహనుమదాదులకునుతత్వమహిమదెల్పినశ్రీకరా, సూరులకునుముక్తిదారిజూపుటకుభూ। భారమార్చుటకునౌతారమొందిననీవే। శ్రీరమాపతివనుచునమ్మితిరా। నీవంటిదొరలికలేరనుచు బుధులనగవింటినిరా। శ్రుతశైలపురవిహారుడై ప్రఖ్యాతిగొంటివిరా। వెలిగొండదాసునినేరములు క్షమియింపనీవేరా। తడవేలనీవక్కౄరునకుజలమందునీవేతీరుగనుసాక్షాత్కరించితో। శౌరినాకాదివ్యరూపముదారకృపగనుపించుమనినే॥నిన్నేనమ్మి॥

ఆరభి కందార్ధం

అష్టాక్షరిమంత్రింబును। నిష్టతోపఠియించిదానినిజమెరిగియునే। కష్టసుఖంబులనొందక॥ కృష్ణాయనుచుదలపవేరా। బ్రహ్మాండమాత్రివిష్ణునిమయమటంచుగనరా॥ అష్టపాశములనష్టపరచితా। నిష్టలింగమునుదృష్టిలో

గనుగొని॥ కృష్ణాయనుచుదలపవేరా॥

కమాస్ రాగం ఆదితాళం

నారాయణయనవే। పాపపుజిహ్వ॥నా॥

దారపుత్రసంసారములోకడి। తేరలేవుపలుమారునోన్నమో॥నారా॥

బూటకమనివినవే। యీదేహమిక కాటికేనిజమనవే। నీటిబుగ్గమువ్వాటికినీయిలతోటిసాటినీకేటికోన్నమో॥నారా॥

ఏలయీభోగమనవే। మలమూత్రముల। తోలుతిత్తనిదెలియవే। కాలునికత్తులపాలయ్యేదవని। చాలనిన్నుబతిమాలితినోన్నమో॥నారా॥

మోసపోనేలవినవే। ధనధాన్యములజూచిభ్రమజెందతగవే। వాసిగేహనుమద్దాసునిసేలురమేశునియాత్మలోజూచివోన్నమో॥నారా॥

మందబుద్ధినివిడువవే। నీయందారామానందయోగీంద్రుగనవే। పొందుగరేబగలందునెపుడునెడసందులేకమదియందునోన్నమో॥నారా॥

ఉండదెప్పటికనవే। వినుకొండపురినుండుశ్రీహరినిగనవే। దండిగానువెలిగొండదాసునందుండుపాపములుచెందునోన్నమో॥నారా॥

కందార్థం శంకరాభరణం

రామాయనిమెదుమంత్రము। పామరమునువిడచియెపుడుభజనయొనర్చే। యామానవునకుమోక్షము। సామీప్యంబనుచుబుధులు॥సాటెందివినవే। సద్గురునితోసాటెవ్వరనవే। ప్రేమతోడనాత్మరాముడైవెలయుశ్రీ। రామానందయోగిరాయునిజగమెల్ల॥ సాటెందివినవే॥

శుద్ధసావేరిరాగం అటతాళం

రామానామొరవినవేరా। నన్నురక్షించనీవిటురారా॥ కామజనకనన్నుకరుణించుదొరవని। నామనంబుననిన్నుప్రేమతోమరువక। వేమరునునేవేడితినియిక వేరుసేయగనేలకేశవ। నామమునవాహృదయకమలనిరామయంబునవెలశియున్న॥రామానా॥

రాతినాతిగజేయలేదా। నాపాతకములుబాపరాదా। భూతములన్నిటిపోషించుటకునుధ। రాతలమందున ఖ్యాతిగవెలశిన। ధాతశైవమునీవెమాధవదలచెదనుసహస్రారమందున। నాతిగూడుకయుండినిర్మలనాయకుడవై నిలచియున్న॥రామానా॥

కరిమొరవినిబ్రోవలేదా। నన్నుకరుణించుటకునింతవాద। పరమపురుషనావెరపుదీరిచెదొర। ఘనినమ్మితినరమరశేయకు। మరువనికమధుసూదనానా

దురితములుపోజిమ్మగపరా। త్పరుడవైయెందెందుజూచిన। భావమైకదలక నుయున్న॥రామానా॥

సాధులమొరవినలేదా। భక్తులాదరించుటకృపరాదా। వేదాంతవేద్యని న్వేడకుచేలుని।మోదముతో మోక్షమును వేగనిచ్చిన। శ్రీధరామేవంకజూచి నచిన్మయుండవునీవుగానిది। లేదనుచునుతిశేయనంతర్వేదివైకనుపడకయు న్న॥రామా॥

పరమభాగవతులజూచి। వారిపాపములెల్లపోద్రోచి। స్థిరముగ శ్రీశైల గిరిపురమున నెలకొని।దరిజేర్చ రామనందబ్రహ్మమైవెలై। పరుడవనివెలిగొం డదాసునిభావమున నే ప్రొద్దుమరువక। మరిమరినిను వేడనంతర్మయుడవైక నుపడకయున్న॥ రామా॥

కందార్థం శంకరాభరణం

జననీజనకులుసహజులు। వనితాసుతపౌత్రమిత్రవర్గంబెల్లన్। తనతోడ రారుమృతికని। మనమునదెలిపొందియిట్టి॥ మమతలేటికిరా। సద్గురుడిట్టిమ రుగుదెల్పునురా। మునుకొనిసద్భక్తజనులతోడగూడి। వనజాక్షుపదభక్తి వదలనివారికి॥మమతలేటికిరా॥

పంతువరాళి రూపకం

చెప్పిపోదుయెప్పటికనుమా। నీవెప్పుడుశ్రీయశిప్పతినిక వేడుచుండుమా॥ తప్పకయున్నంబువుదక మెప్పుడు వేశిననునిల్వ। దెప్పుడోనేవేళవాకను రెప్ప పాటులోనశించి॥చెప్పి॥

నమ్మరానిదనియెరుంగుమా। యీదేహమునాసొమ్మనిభ్రమించ బోకుమా। యెమ్మెలెల్లజేయుతోలుబొమ్మరీతికీళ్ళునరము। లిమ్ముదప్పిపోవు నాదినమ్మలోననమ్మకముగ॥చెప్పి॥

రోగములకునాలయమనుమా। నీవిట్టితుచ్ఛభోగములమెలంగుకుండు మా। రాగరోషమైనదీనిబాగునోగుదెలియవకట। యోగులెల్లమంత్రజపవి రాగులైమెలంగుచున్న॥చెప్పి॥

నికరమనితలంచుకుండుమా। యిదియెప్పటికియనిత్యదేహమనిదలంచు మా। పెకరనింద్రియంబులచేజిక్కికామమోహములను। సాక్షియడవినీ టనొయేదికురపడునొచకరగాను॥చెప్పి॥

అండజేరినిలచియుండుమా। శ్రీగిరిగలశ్రీయాచార్యునిమరువకుండు మా। దండిగవెలిగొండదాసునిందుమనమునందువెల్గు। చుందురామానంద

పరమయోగి జేర నేరకున్న॥చెప్పి॥

హుశ్చకందార్థం ఆఠాణరాగం

ఎప్పటికైనను దేహము। చెప్పకజనునిజముదీనిచందమెరిగి శ్రీ। యఃపతి నికధ్యానించిన। తప్పక వైకుంఠమందు॥ తాజేరగలరు। శ్రీహరిసన్నిధాన మందెదరు। కప్పినమాయాంధకారములోపల। ముప్పరిగొని శోకమునను చింతిలనేల। యెప్పుడో యేవేళనో శ్రుతిదప్పగావుననిపుడె సద్గురు। తప్పకను పూజించితను తాదరచిబ్రహ్మము దెలియువారలు॥ తా జేరగలరు॥

యిందుస్తానికాఫి ఆదితాళం

నమ్మరాదువినవే। దీనినడతలన్నియునుగన వేమనసా॥ యిమ్మహిలోత నువిదినిత్యంబని। కొమ్మలగూడకరమె మ్మెలుజేతువు। కమ్ముకొన్నప్రకృతిచేత నగువిధిగలిగినట్టి యీవిచిత్రకపటపు। బొమ్మలాటలనృతమనుచుదృఢముగన మ్మి వేగగురుని జేరిమనవే ॥నమ్మ॥

నీటిబుగ్గవినవే। యిదినిలువబోదుధరగన వేమనసా॥నీటి॥ సాటెవరనిసం సారమునందున కూటస్థుడవై కులుకుచుండెదవు। బూటకంబుయెంతకాల మున్నను కాటికేనుస్థిరమటంచునీయిల। తోటిచెలిమివదలినిత్యముక్తికిబాట గాంచిగురుని జేరిమనవే॥నమ్మ॥

కుండరీతియనవే। దీనికులములేదనుచుగన వేమనసా॥ కుండ॥ తిండిపోతు వై కండలుపెంచుకదండివాడననిదలచుచుండెదవు। వుండబోదునిజముగాదు ధరవినుకొండపురముజేరిదివ్య కృపవెలి। గొండదాసు పాతకములనెల్లను చెండు రామగురుని జేరిమనవే॥నమ్మ॥

హుశ్చకందార్థం నాదనామక్రియ

మననే సర్వజగంబులు। మనసుకుశక్యంబుగానిమాయలులేవం। చునుసన కాదిమునీంద్రులు। మనుకొనిమదినిల్పినట్టి॥ ముచ్చటవినవే। యెప్పటికియీ మోహముంచకువే॥ తనుధనములుభార్యతనయులాప్తులుబంధు।జనములుం డగనాకేమనిసంతసింతువు। వినుముయెప్పటికైననస్వంబనితలంచియు తాను తానై। మనినరామానందయోగీంద్రులిమనంబున విడువకనెనా॥ ముచ్చట వినవే॥

నాదనామక్రియ అటతాళం

తనువెప్పటికిశాశ్వతముగాను యుండుననిదలచివర్తింపకేచిలుకా। క నుమాయానంతలోకష్టసుఖములు రెండుగలవనుచు జెలియవేచిలుకా॥తను॥

పంచవన్నెలుగలుగుపంజరముయున్నదనిభ్రిమశితిరుగకెరామచిలుకా సంచితముపోదోలుసద్భక్తులనుగూడిశరణనుచుమ్రొక్కవేచిలుకా॥తను॥
పరభామలనుజూచిపరద్రవ్యములుగోరిపరులదూషించకేచిలుకా। శర ణాగతత్రాణబిరుదుగల్గినగురునిసరసజేరవెరామచిలుకా॥తను॥
ఎంచరానీయీప్రపంచసౌఖ్యముల కాసించబోకుము రామచిలుకా। మెంచశక్యముగాకమించియున్నట్టిగురుపంచజేరవెరామచిలుకా॥తను॥
దారాదియీషణత్రయములనునీవెపుడుదవిలివర్తించకేచిలుకా। పార మార్థికునిగనిపరతత్వమందునీభ్రాంతినుంచుమురామచిలుకా॥తను॥
లోకానుసారివైలౌకికవృత్తులకులోబడకయుండవేచిలుకా। ప్రాకటం బుగనిర్మలాకారుడైయున్నప్రభువుజేరవెరామచిలుకా॥తను॥
పొందుగాశ్రీశైలపురినివాసుండైనపురుషోత్తమునిజేరుచిలుకా। సం దేహములుమానిసమరసానందమగుసాయుజ్యమందవేచిలుకా॥తను॥
మమతలనుగోసిరామానందయోగిగురుమరుగుజేరవెరామచిలుకా। వి మలవ్రతంబుచేవెలిగొండదాసుమదివేరుసేయకనుండుచిలుకా॥తను॥

శంకరాభరణం   శహనరాగం

యిదినాదనిమదమందుచు। వదలకసంసారమందువాంఛితుడైశ। మ దిలోనసెపుడుసద్గురు। పదసేవయొనర్చలేని॥ పామరులకును। కేవలమో క్షపదవిలేదికను। మదిగర్వులైపెద్దలెదుటనిలచినిందా। స్పదములచేతదుర్మ దులైవర్తించెడి॥ పామరులకును॥

శహనరాగం   ఆదితాళం

వట్టిదిరాయీమాయ॥ దీనిగుట్టులిదెయలేరామె॥ పట్టుగనన్నిటభ్రమ కల్పితమైముట్టకనింద్రియమోహములామె॥వట్టి॥
మాయాకారములామె। దీనిమహిమదెలియలేరామే। బాయకమనసే వారధియైభ్రమ। లాయతవీదులునైజెలువామె॥వట్టి॥
నామరూపులేదామె। దీనినడతదెలియలేరామె। నామహదాంకృతు లైయీజగములు। తామమేమనుచుదలగనిదామే॥వట్టి॥
యేకవృత్తిలేదామె। దీనినెరుగువారులేరామె। సాకారంబనుసంసా రంబున। చీకటివిధమైచిక్కనిదామే॥వట్టి॥
వుండకుండినట్లామె। వినుకొండపట్టణందామె। దండిరామయోగికృ పనుయీవెలిగొండదాసుమదినుండనిదామే॥వట్టి॥

కందార్ధం   శ్రీరాగము

మలమూత్రాదికయుతమై। యిలలోజన్మించియాత్మనెరుగకతిరిగే। తను
లువలకెల్లను మోక్షము। కలనైననులేదటంచు॥ కనుగొనవేరా। తెన్నెరిగిన
గలదనుకోరా। జలజపత్రమునందుసలిలమంటనిరీతి। దలపనశక్యమాత్మ
కునంటదీతనువు॥కనుగొనవేరా॥

మధ్యమావతిరాగం   ఆదితాళం

ఎంతజెప్పినవినవేమిటికే। వోవెర్రిమనసాఅంతరాత్మునిగనుగొనుటకే।
సంతకూటమీసంసారముపైభ్రాంతివిడువుమనిపరిపరివిధముల॥యెంతా॥

నీచవర్తనలనీవుడాసి। ధనధాన్యములజూచిమోహమునరాసిజేసి। దా
చిదాచియదిదలచిమురసెదవు। గోచిమాత్రమునుగొంచుపోవనుచు॥యెం॥

ఎన్నాసతిసతులుబాంధవులు। నన్నాదమ్ములుయున్నారనిమురయుట
నికచాలు। తిన్నగనినుకడతేర్చలేరనుచుమన్ననతోనీకెన్నివిధంబుల॥యెంతా

మలమూత్రములబారలుచుండి। గర్భమువెడలియిలలోబుట్టిమాయచే
నుండి। కలనైననుయాకష్టముదలపక। వలతువెప్పుడిదివట్టిదెయనినే॥యెం

దండిశ్రీరామయోగిజేరి। సుఖమందగవెలిగొండదాసుడుమదిగోరి।
యుండునట్టివినుకొండనుసతత్కృప। నిండుగురునిబల్దండజేరుమని॥ యెం॥

హెచ్చుకందార్ధం   శంకరాభరణం

గురుకరుణచేతతనుతా। నెరిగియుబ్రహ్మంబుజూచియిట్టిదియనియే।మ
రకభజించినవారలు। ధరలోసుఖదుఃఖములను॥ దగులబోరన్నా। నిర్మలగు
ణధామునిగన్నా। అరలేకకామమోహాదిషడ్గుణములతరిగిజ్ఞానాజ్ఞిచేదగ్ధ
ముగాజేశి। స్థిరమతుండైనిలచిసచరాచరములంటకనిందుకొనిశ్రీ। హరి
యెదానైవెల్గుననిదమయాత్మదృఢమైయున్నవారలు॥ దగులబోరన్నా॥

హిందుస్తానికాఫి   ఆదితాళం

గురునిమదినివేడరా నీగుణములన్నిబోవురా । పరగమరుగుతరుగులేని
బ్రహ్మమైవెలశేవురా॥గురుని॥

మాటిమాటిదాటరా ముమ్మూలలోనెనిలువరా। కాటుకపక్షులను
రెంటికదలకుండనుంచరాశ్రీ॥ గురుని॥

వారువీరనుటేలరా। మదివేరుశేయాకనిలవరా। కోరిముక్తికాంతతోటి
గూడినీవైయుండరాశ్రీ॥గురుని॥

అంటియంటకనిలవరా। ముక్కంటిలోనెచూడరా। వొంటిస్తంభభ్రమే

డలోనె। యోలలాడుచునుండరా శ్రీ॥గురుని॥

వాదభేదముమానరా। నీవారశూకముదెలియరా। నాదుబిందుకళలక వలనాటకుడవైయుండరా శ్రీ॥గురుని॥

మందబుద్ధినిమానరా। యానందరూపునిగానరా। యెందుతానైయున్న రామానందయోగీశ్వరుడెరా శ్రీ॥గురుని॥

అండనీవనివేడరా। వినుకొండపురియందుండురా। దండిగవెలిగొండదాసుకుదైవమైవెంచేసెరా శ్రీ॥ గురుని॥

ఆరభి కందార్ధం

వెతుకగనేలనురారా। సతతము శ్రీగురునిసేవసల్పెడివారల్। హితమతులై కలకాలము॥ మతిలోహరిభజనమానరూరా। యాతనువెప్పటికి। సతమానిదలచియుండరూరా। క్షితిజననంబై జేయు పాపముల। వెతలబొందకనువేయువిధంబుల॥ మతిలోహరిభజనమానరూరా॥

శంకరాభరణము అటతాళం

వెతుకనేలనురారా। నీయాత్మలోవివరించిననుదెలియరా॥ సతతముసద్గురుచరణకమలములు।గతియటంచునునీవునిర్మలమతుడవై తన్నుతాగనరా॥ వెతుక॥

ఎందుజూచిననేనేరా। నీమనసుయానందించిననుగనరా। బిందునాదుకళభేదమేమియులేక। అందియుండకసజ్జనులమదికందిపొంది మెలంగువాడరా॥ వెతుక॥

రేపుమాపులేదురా। సతతంబొక్క-రూపమైయున్నానురా। చూపులకావలసుఖముగవెల్గుచు। దాపులోనుండియును నేనొకరూపమైకనుపడనివాడరా॥ వెతుక॥

ఎగుపదిగువగాకరా। అన్నిటతానైతగిలితగలకుందురా। సగుణనిర్గుణములకుసాక్షిభూతుండనై। మిగిలిభావాభావములనెడతెగకకనుపడుచున్నవాడర॥ వెతుక॥

అందిందోయనబోకురా। చూడరారామానందయోగీంద్రుడరా। పొందుగశ్రుతగిరియందుప్రకాశమై। అందముగవెలిగొండదాసునియాత్మలోనివసించువాడర॥ వెతుక॥

అర్ధకందార్ధం మోహన

గురుడే శ్రీహరియనుచును। ధరలోనెవరైనమదినిదలచినటించే। నతన

కుశ్రీవైకుంఠము। స్థిరమైయీభువినిమాయ॥ చేరదు। ధనధాన్యములగోరఁ దు।కరుణాకరుడునుపరుడగుసద్గురు। మరుగుజేరిశ్రీకరుడౌనతడిల॥ చేరదు॥

నా ద నా మ క్రి య రూ ప కం

దేశకుడేదేవుడనుమురా। నీయాత్మలోపల మేకుమైవెలుంగుచుండురా॥ ఆశలనేపాశములనునాశనముగజేసిపంచ।కోశములనుద్రోసిస్వప్రకాశము తనలోనజూపి॥ దేశకుడే॥

పుట్టుగిట్టుచుండెటిభయమట్టిలేనిదనుచునుచే। పట్టిబ్రోచియిట్టిదనుచు గుట్టుదెల్పగానెచూడ।బట్టబయలుగానెయుండురా। యెడసందులేకమిట్టప ల్లములనునిండురా। లోవెలుపలనొకపట్టుగకదలకనెయుండురా। అదివ్య తేజమిట్టిదనివచింపలేరురా। వట్టిదవకునీవుమననుదిట్టపరచియున్నదీని। ప ట్టుదొరుకుననుచునీకుగట్టిగబోధించినట్టి॥ దేశకుడే॥

ఎన్నతరముగాకనిండియున్నపరాత్పరుసనీదు। కన్నులందుజూపుటకైమ న్ననతోబిలచినీకు। వున్నదున్నట్లుదెల్పరా। నీవెనుకముందునున్నదానివెతు కనేలరా। బ్రహ్మాండమంటిమిన్నయిగుడునున్నదాయరా। నీవెవుడుదానిగ న్నవెనుకనీవులేవురా। అన్నవిన్నరదెలియుముయిక మున్నురుషులునాత్మలో న। గన్నపరబ్రహ్మమనుచుతిన్నగాబోధించినట్టి॥ దేశకుడే॥

లోకలోకమందునిర్మలాకారుండైనవాని శోకడగనుమనుచునీకుపొందిం చుటకునుసర్వం। లేకరీతిగానుజూపురా। అదిరాకపోకలేకనంతనేకమాయ రా। నీవికనుమరువబోకువేరెలేదుచూడరా, విను కొండనిలయమైకదలుటలే కయుండిరా। ప్రాకటముగరామగురునిపదకమలముతెవుడుమరువ। బోకేక ను వెలిగొండదాసుపొందుగపూజించినట్టి॥ దేశకుడే॥

కం చా ర్ధం మో హ న

పరశీరుహాక్షులారా। పరమానందమునపుణ్యపతియగునిశ్రీ। గురు మూర్తిపాదకమలము। లరగంటనుజూచిభక్తి॥ నర్పించరమ్మా॥ మీకును మోక్షమబ్బునెకొమ్మా। మురయుచుద్వాదశాబ్జమునప్రణవాకారుడై। స్థిర ముగనుండెటిచిత్ప్రకాశునిగని॥యర్పించరమ్మా॥

మో హ న రా గం అ ట తా ళం

పూజింపరారే। మీరుసకలపుణ్యాలమ్యోదరే॥ యీజగమందునసీశ్వరు డైయున్న। రాజయోగిపదరాజీవములను॥పూజిం॥

మాటిటవిడచి। మూటిమూటిమూలములదెలసి। మేదుతొమ్మిదిదాటి

మేకతత్వముచేత। కూడిచరించునిర్గుణుడైనశ్రీగురుని॥పూజింప॥

ముకుట్టైజూచి। మేరుశిఖరమెక్కియునిలచీ।చుక్కలదొరకన్నుమిక్కుటమైసర్వ। దిక్కులయందుతానొక్కడౌశ్రీగురుని॥పూజింప॥

ఐన్నెలురోసి। సుషుమ్ననివాసముజేసి। విన్నకన్నదానిమున్నగదలచియు। యెన్నతరముగాకయున్నట్టిశ్రీగురుని॥పూజింప॥

కూటముదెలసి। ముక్తికాంతగూడియునిలచీ। హాటకశాలలోనాడుచునున్నయా। నాటకధరుడైనమేటియౌశ్రీగురుని॥పూజింప॥

తామసమణచి। నిర్మలగుణధాముడైవెలసి। భూమిలోశ్రుతగిరిపురమందునెలకొని। రామయోగీంద్రుడైగంజిల్లుశ్రీగురుని॥పూజింప॥

దండిగవెలసి। కనుపాపలోనుండియునిలచి। అండజేరిమ్రొక్కుచుండేడియావెలి। గొండదాసుమదినిండినశ్రీగురుని॥పూజింప॥

అర్ధకందార్ధం     మోహన

కంటికిరెప్పవిధంబున। జంటైపదునాల్గుభువనజాలములెల్లక। వంటిగనీవైయున్నది। గంటినినీవిభుడనన్ను॥ గావరా। రామానందయోగివరా। యింటిలోనయారింటిపైనముక్కంటిలోనగనుగొంటినిన॥ గావరా॥రామానందయోగివరా॥

ముఖారిరాగం     అటతాళం

కనుగొనరాదటవే। నీకునుముక్తిగలుగునామాటవినవే॥ మనమునయెప్పుడుసన్మతిగసద్గురుపాద। వనజముల్గొల్చుచువదలకనిలచిన। తనువులోసిరువన్నైదింటినితత్వములనన్నిటినివేరుగ।ఘనముగానెరిగించినీవవిగావనుచుబోధించుగురుని॥కనుగొన॥

మందబుద్ధిమానవే। నీకునుమోక్షమార్గమేదోగనవే। ముందుగనాచార్యునంటెనీమనసెల్లబొందజేసినీదుసంశయమువిడచిన। అందముగనాజ్ఞేయమునుద్విదళాబ్జమునప్రణవంబువీనుల। యిందునిల్పియునెపుడుపరమానందమునుబొందించుగురుని॥కనుగొన॥

కపటత్వమునువిడువవే। సద్గతినొందక్రమమేదోగనుగొనవే। అపచారహేతువౌచపలత్వమునువిడచి। నుపచారివైగురుకృపనీవుగోరిన। త్రిపుటిమధ్యమునందుసమరతదేలివుపరతిదెలసికలసియు। నపరిమితగంభీరమగుయాతపసిమైగనుపించుగురుని॥కనుగొన॥

సంచితములువిడవే। నీవేహరిసాన్నిధ్యమునయుండవే। పంచకోశముల

గాంచివద్గుణములు। ద్యంచివేగగురుపంచనజేరిన। పంచకళలకుమించికన్నుల మెంచశక్యముగాకవెల్గును। పొంచిమెరుకనుద్యంచిలేనిదెగాంచితానైయుంచుగురుని॥కనుగొన॥

రాగద్వేషముమానవే। రామనందయోగీశ్వరులజేరవే। త్యాగివైనీవు యేభోగముగోరకసాగిలపడిముక్తిసన్నిధిజేరుము। వేగమునవెలిగొండ దాసునిశిక్కతోబ్రోచుటకుశ్రుతగిరి। బాగుగావెంచేసికామవిరాగుడైవెల్గుసద్గురుని॥ కనుగొన॥

కండార్ధం శంకరాభరణం

ఎక్కువతక్కువలెంచుచు। ముక్కునుబిగబట్టినీటమునిగియుహరినే। దిక్కనగనుగొననేరక। కుక్కలుమొరిగినవిధంబు॥ గూయఫలమానా। (శ్రీ) గురుజేరిగురిదెలియకున్నా। నిక్కముగనుయితరమక్కువలనుమాని। వాక్కరీతిగజూచుచున్నవారికిమది। మిక్కటంబైయుండికరములజిక్కకనుబ్రహ్మాండభాండము లక్కజంబైనిలచితనయిరుప్రక్కలనుతానున్నదెరుగక॥ గూయఫలమానా॥

కాంభోది అదితాళం

ఉన్నదితనువులోనాత్మదరచమనెవృత్తమగురువులునరుదన్నా। కన్నుల మూసుకతిన్నగగోనిగటికర్మపగురువులుగలరన్నా॥వున్నది॥

మాటిమాటివిడనాడిసూటిగాముక్తిజెందువారరుదన్నా। దీటులేరు నాతోటివారలిలతిరిగిచెప్పువారుగలరన్నా। వున్నది॥

అష్టగజంబులబట్టిపగ్గములనమరగట్టువారరుదన్నా। నిష్టచేతచట్టిళ్ళ మునుగుచునునిజమెరుగనివారరుదన్నా॥ వున్నది॥

పూటిగబాటనచారవజేసుకొనిసోహమనేవారరుదన్నా। సాటిగపెద్దలసాధనదెలియకచచ్చిపుట్టెవారుకలరన్నా॥వున్నది॥

ఏటికినవమనుభాటలోవెన్నెలనెరిగియుండువారరుదన్నా। నేటుగ బ్రహ్మమునెరుగకమతములనిందించేటివారుకలరన్నా॥వున్నది॥

గండికోటలోనుండేపామునుకదలించేవారరుదన్నా। కుండలికావలఖండముదెలియనితిండికోరులేకలరన్నా॥వున్నది॥

సన్నపుదిడ్డినదూరికన్యతోకన్నుగలిపెవారరుదన్నా। విన్నదికన్నదివివరముదెలియకవేత్తలమనెవారుకలరన్నా॥వున్నది॥

అందముగాశ్రీరామయోగిగురునాత్మదెలియువారరుదన్నా। ముందు

గసద్గతిచాటనెరుంగక మూర్ఖవాదులగలరన్నా॥వున్నది॥

దండిగ శ్రుతగిరివాసుండితడనిదలచి మ్రొక్కువారలరుదన్నా। నిండుతోని వెలిగొండదాసుమదినిలచియున్నదేకలదన్నా॥వున్నది॥

కంబార్ధం — శంకరాభరణం

పరమాహ్లాదముతో గురుచరణాంబుజములకు సేవసల్పుచునుండే। నరులకుసురులకుదొరకని। కరమరదగుపరమపదము॥ గనుపించునన్నా॥ వారికి ముక్తిగలుగునోయన్నా। నిరతమునాత్మలోనిజముకల్లయును రెండు। పరికింప స్థిరమైనబ్రహ్మముతవలోన॥గనుపించునన్నా॥

పంతువరాళి — ఆదితాళం

గురుకారణమై వందుకుతనదుర్గుణములుమానిందెరుకా। గురుడే సాక్షాత్పరబ్రహ్మమనిగుహతుదెలసినాదెరుకా॥సద్గురు॥

పరకాంతామణులనుజూచియుమది భ్రమలేకున్నదెమెరుకా। సరసులతోవాదులుసేయక నేశరణనిమ్రొక్కిన దెరుకా॥సద్గురు॥

ధనధాన్యంబులుజూచి భ్రమలచేతగలకతిరిగిందెరుకా। విని కనిమననంబై తనుతానెవివరించినదేమెరుకా॥సద్గురువు॥

బూటకమనుసంసారములోపలబారిలకనిలిచిందెరుకా। కూటస్థశమనముక్తికాంతతోగూడియుండినాదెరుకా॥సద్గురు॥

యీషణములకునులోబడకనుతానెరిగియున్నదేమెరుకా। శేషంబనుసుప్రసాదమునుగురుజేరిభుజించినదెరుకా॥సద్గురు॥

మనోబుద్ధిచిత్తాహంబులదామరచియుండినాదెరుకా। తనువులోయాపోజ్యోతైవెలిగెతత్వముదెలిసిందెరుకా॥సద్గురు॥

ఘనముగరామానందయోగికృపగనుగొనుచున్నాదెరుకా। మనసులోనవెలిగొండదాసుగణిమరువకదలచిందెరుకా॥సద్గురు॥

కంబార్ధం — భైరవి

పరమానందముతోసు। స్థిరమతివైనిన్నునీవెదెలియుటకై త్రి। గురుమూర్తినిప్రార్థించిన। పరమార్ధంబిదియ... ॥ పట్టుగదెల్పు। నీభావమాభావములోగల్పు। తరుగక పెరుగకవిరుగకకరుగక నెరుగకజతలేక నేకమైనదాని॥ పట్టుగదెల్పు॥

నాదనామక్రియ — ఆదితాళం

సత్యజ్ఞానానందమయుండై సాక్షిగవెల్లుచునున్నదో రే। నిత్యానిత్యవివేక

ము దెలియక నిలకడగన లేవు రావా రే॥సత్య॥

భూతపంచకంబైన శరీరము బూనుక యున్నది రావా రే। పాతరలాడు చునున్న నీకు యీ పట్టుదొరకదది రారవా రే॥సత్య॥

ఆధారంబుల పైననున్న యీ హంసంగన రావా రేవా రే। సాధులగనుగొని శరణని మ్రొక్కక సంధి దెలియ లేవు రావా రే॥ సత్య॥

నాదబ్రహ్మానందంబై యది నాటుకయున్నది రావా రే। భేదవాదములు మానక ప్రణవా బీజాక్షర మెరుగవు రవా రే॥సత్య॥

అంతరంగమందున నొక ముక్తి కాంతయున్నదది రారవా రే। చింతలెల్ల మానినీవు గోరిన చిక్కనిలచుచున్నాది వా రే॥సత్య॥

రక్షకుడై సహస్రార మునందు నిరంజనుడై నాడు రావా రే। మోక్షమార్గ మిది యని గనుగొనకను। ముక్తి దెలియ లేవు రావా రే॥సత్య॥

ఎడ తెగక నుకను పాపలనడుమను యీ పోజ్యోతై యున్నదో రే। బడలిక నొందక బ్రహ్మము తానని పరికించు ము రావా రేవా రే॥సత్య॥

దండిగాను వినుకొండపురంబున తారకమైనాది రావా రే। అండజేరి రామ యోగిగురువరు నాత్మ దెలియవలెను రావా రే॥సత్య॥

తరుగు విరుగు లేకను తానంతట తానై యున్నాది రావా రే। కరుణతోడ వెలిగొండ దాసునకు గనుపడుచున్నాది రావా రే॥ సత్య॥

కందార్థం* శంకరాభరణం

తారకసాంఖ్యములరశియు। నేరుపుతో హంసగూడి నిటలాగ్రమున ఛ। జేరియు ముక్తి నిగనుగొని- ధీరుండై నిలచువాడె॥ దేశకుడన్నా॥ అతడే రామ యోగీశుడన్నా। వారు వీరను నేరములను విచారమున పోదోలి నిర్వికారుడై వెల్గెటి చిత్ప్రకాశుని గనుగొన్నవాడే॥ దేశకుడన్నా॥

దర్బారురాగం అటతాళం

యెంతమహనీయుడే కొమ్మా॥ గురుసేవా నివద్నింతునమ్మా। సంతసమును భక్త జనులకు మదిలోన। చింత దీర్చి ముక్తి కాంతను జూపెను॥ యెంతమ॥

పాపవిదూరుడే కొమ్మా। మీరు భక్తితో రారె వోయమ్మా। తాపత్రయంబుల తలద్రుంచి నాలోన। రేపు మాపు వెల్గెరూపము జూపెను॥ యెంత॥

నిష్టాగరిష్టుడే కొమ్మా। మీరు నిష్టతో సేవించరమ్మా। అష్టపదంబుల నష్టపరచి నాలో। యిష్టలింగముకను దృష్టిలో నిలిపెను॥యెంత॥

తారకపరమీతుడే కొమ్మా। మీరు నీమముతో రారోయమ్మా। రామ

యోగీంద్రమద్దైరశిఖులరక్షింప। భూమిలోశుక్తిగిరిపురమందు వెలసెను॥ యెం॥

దాసపోషకుడెవోయమ్మా। మీరుదోసిలొగ్గిమ్రొక్కరమ్మా। వాసిగ వెలిగొండదాసునివ్వా దయను। వాసుదనైచిద్విల సద్దైవెల్గెదా॥ యెంత॥

కందార్థం — రూపకం

కోటలునేడును దాటియు। కూటస్థశమంగునున్నకుండలిగనియా। హాటకశైలమునందున। నాటకధరుడైనగురుని॥ నమ్మియుండుమురా॥ నీకునుయితరమెమ్మెలేటికీరా। సూటిగానుముక్తిభాటనీకిదియని। నాటదెల్పెననీవీమాటమరువబోక॥ నమ్మియుండుమురా॥

ఆనందభైరవి — రూపకం

పిచ్చివానిజూడరమ్మ అమ్మయ్యా। వీనిపిచ్చయేమొ తెలియదామెలక్కయ్యా॥ ముచ్చువాలెనుండినన్నుయెచ్చరించిపిలచితా। హెచ్చుదేవుడొక్కడనుచుమచ్చికతోజెప్పుచుండు॥ పిచ్చ॥

వాదభేదమేమియెరుగడమ్మయ్యా। వీనిఅదిఅంత్యమెరుగవశమెఅక్కయ్యా। సాధుజనులగూడిసుప్రసాదముతాగోరిపరమబోధగురునిచేతవిన్నపాదుదెలసుననివచించు॥ పిచ్చ॥

చూడచుట్టమెవరులేరుఅమ్మయ్యా। వీనిచూడవేదుకాయగదవెఅక్కయ్యా। కోడెపాముఁరీతినారుమేడలన్నిదాటినన్ను। కూడలికినిరమ్మటంచుకూరిమితాబిలచుచుండు॥ పిచ్చ॥

యెమ్మెలేమిలేవుగనవెఅమ్మయ్యా। వీనినమ్మటకునువశముగాదెఅక్కయ్యా। దిమ్మరివలెవిరిగిదిడ్డినీశిమధురపానమునీ। సొమ్మువలెనుగోళ్లుమేల్తమ్మిలోనటంచుబలుకు॥ పిచ్చ॥

చూపుచూడవెర్రిచూపెఅమ్మయ్యా। వీనికాపురమొకయూరలేదెఅక్కయ్యా। రేపుమాపులేకవెల్గెవ్యాపకుడైనిలచిగురుని। దాపుజేరియెందెందునదరచిననేననుచుబలుకు॥ పిచ్చ॥

చక్కదనమేమిలేవెఅమ్మయ్యా। వీనికెక్కువైనదైవమెవరెఅక్కయ్యా। నిక్కముగనునమ్మివేరుమక్కువలనుమరచితేయిరు। ప్రక్కలందునిలచినేనుచిక్కదనని జెప్పుచుండు॥ పిచ్చ॥

చిన్నపెద్దగాదుచూడుఅమ్మయ్యా। వీనిమెన్నదరముగాదెయెవరికక్కయ్యా। మన్ననతోబిలచియుండునున్నబాధనేనటంచు। కన్నులలోగనుగొనుమనితన్నగబోధించుచుండు॥ పిచ్చ॥

బూటకంబులేమిలేవెలమ్మయ్యా। వీనిసాటియెవరులేరుచూడఅక్క-య్యా। వాటముగను రామయోగివర్యుఁడనగునాసేవయే। ఘాటనీకుముక్తి కనుచుపరమకృపనుబిలచుచుండు॥పిచ్చ॥

ఇతరచింతలేమినెఱుగడమ్మయ్యా। వీనిసతతమునుభజింపగోరుఅక్క-య్యా। మతిచేవెలిగొండదాసుమరువకదలచుచుండె పతితపాపనుడనేనని దాసలిచ్చిచెప్పుచుండు॥పిచ్చ॥

కందార్ధం ముఖారి

ఆకారమునాకారము। లేకనుమేకల్మషంబులేశంబైనన్। సోకకచరాచరంబుల। ప్రాకటముగయున్నవాని॥ పరునిచేగన్నా॥ వాడేముక్తిపరుడౌనోయన్నా। లోకములెల్లనలోకమానవ్వుల। నేకస్వరూపమైజోక వెలుగువాని॥ పరునిచేగన్నా॥

శ్రీరాగం రూపకం

కోరివేడినారా। సద్గురువరయిందురారా॥కోరి॥ ఘారకతత్వనిమది లోపట్టుగనీపాదములే॥కోరి॥

స్థిరమతినీవనుచు। నినుజేరితిఘనుడనుచు। అరమరసేయకుమికనన్నాదరించుటకునునిన్నే॥కోరి॥

రక్షకుండవనుచు। నిరంతరమునుగనుచు। మోక్షదాయకనేజేయుమొరనాలించుమనినిన్నే॥కోరి॥

నిర్మలుండవనుచు। నేననుమదిగనుగొనుచు। ధర్మార్థకామమోక్షదాయకుడనినుమరువకనే॥కోరి॥

సుందరాంగుడనుచు। నిన్నెందుమరువననుచు। అందముగనుశ్రీరామానందయోగివర్యనిన్నే॥కోరి॥

దండివాడననుచు। వెలిగొండదాసుననుచు। అండజేరెనేడుకనుల పండుగాయెమదినినిన్నే॥కోరి॥

అర్ధకందార్ధం మోహన

యేటికియీభ్రమవినరా। బూటకమీదేహమెంతపోషించినయా। కాటికినిజమనిపెద్దలు। చాటించిరివినవదేర॥ చాలుగా॥ సద్గురునిజేరమేలుగా। కాటుకపత్తుల కూటముజేసుక। కోటిశిఖరమున మెలగుచునున్నా॥ చాలుగా॥ సద్గురునిజేరమేలుగా॥

మధ్యమావతిరాగం అటతాళం

కొండయెకటి-లేనిగుణహీనులకుముక్తి। గోరినదొరుకునటె॥ తిండిచేత మేనికండలుబెంచుక। మొండివాదములాడెరండలెల్లనువిను॥కొండ॥

కాసుజేతునునీచకర్మలనగుదేహవాసనలనుదగులుచు। గాసినొందిమరలకర్మముల్ జేయుచు। దోషమెరుగనట్టితులువలెల్లనువిను॥కొండ॥

హద్దుమీరిపిన్నపెద్దలనెరుగక ముద్దుకూతలుగూయుచు। కద్దులేదనుభువిపద్దులుబలుకుచు। ప్రొద్దుబుజరిపెడిమొద్దులెల్లనువిను॥కొండ॥

గట్టిగప్రకృతిచేగలిగినసంసారకాంతచేతమెలగుచు। పట్టుదొరుకకగుట్టిట్టుబొర్లితుద। ముట్టకతిరిగేటిమూర్ఖులెల్లనువిను॥కొండ॥

అందముగారామానందయోగీంద్రునీయాత్మనాకెరుకనుచూ। ముందుగశరణనిమ్రొక్కనేరకనుమ। దాంధులైతిరిగేటిపందులెల్లనువిను॥కొండ॥

దండిగవెలిగొండదాసునిబ్రోచేటిదైవమెవ్వరోయనుచూ। గుండతనముచేతకులగోత్రములనెంచి। పండుటాకులరీతిపడువారలెల్లవిను॥కొండ॥

కందార్థము మోహన

నారాయణనీనామము। వారితసద్భక్తినెపుడువదలకబలికే। సూరిజనసత్తములలో। జేరియుసాయుజ్యపదవి॥ జేకూర్తువన్నా। వాడేభక్తశీలుడోయన్నా॥ సారెకునీమంత్రజపముపదేశించు। కారణచార్యునిగనిమ్రొక్కువారికి॥ జేకూర్తువన్నా॥

శంకరాభరణం అటతాళం

కనుగొంటినమ్మా। సద్గురునాలో॥ కను॥ మనమునదాసోహమనుచునేసద్భక్తి। ఘనులనుగూడిహృత్కమలమధ్యమునందు। దినకరునికాంతులనుమించినదివ్యమంగళుడైనిరంతర। మనుమహాత్ముండైవెలుంగునుగా। రేబగలునెడతెగకనుశాశ్వతుడైమెలంగునుగా। యింతనివచించుటకునుతరంబదిగాకయుండెనుగా। తుదమొదలువొకవిధమునునుకదలకమెలగుచుండెనుగా। తన్నుతాగనగా। వినకగనకనుకినుకలేకనువెనుకముందునటించబోకను। తనకుదానైయుండియన్నిటతగలకుండునిరామయునినే॥కనుగొంటినమ్మా॥

పట్టువిడనమ్మా। నాజన్మసాఫల్యమేమమ్మా। రట్టయినమనసునట్టిట్టుగదలనీక।కట్టుజేసియాత్మగనుగొనువారికి। పట్టపగలుగనుండియచలబ్రహ్మమైపృథివినాకాశము।ముట్టుకొల్పియుండిలేదాయెనుగా।అదిచూడకదలకచ

ట్టువలెనంత తానామెనుగా। వుండిలేనే లేనట్టుదోచినదదేకనుగొనగా। పరిపూర్ణమై యేతట్టుజూచినచుట్టుకొన్నదిగా। తన్ను తాగనగా॥ యిట్టిద ట్టిదటంచుపల్కనెట్టి వారికినలవిగాకను। దట్టముగయున్నట్టినిర్మలధాము డైననిరామయుని నే॥కనుగొంటి॥

అందితినమ్మా। పరమానందమాయె నేకొమ్మా। ముందుగ శ్రీరామానందయోగీంద్రుడై పొందుగనిలచెనాడెందములోనాడు। బిందుకళలకభేద్యమై వెలుగొందుసచరాచరములకు నెడ। సందులేకనునిండియుండెనుగా। సర్వభూతంబులయందుపొందికగామెలంగెనుగా। వినుకొండనిలయుండు తానైకదలకుండెనుగా। వెలిగొండదాసునికందమై మదియెందునుండును గా। తన్ను తాగనగా॥ అందునిందునుపొందకనుభ్రమజెందికష్టములొందకను యెందెందుగననందం దెవిమలానందుడైననిరామయుని నే॥కను॥

కం బా ర్ధ్రం శం క రా భ ర ణం

ఆదికినాదియు తానై। భేదంబునుబొందకెందుభీతియులేక। నాదబ్రహ్మంబై తా। పాదుగనెలకొన్నవాని॥ పరికింపవన్నా। వానిమహిమభావించుమన్నా। సూదిమోపనుసందులేదనిగనుగొన్న। వేదాంతులకునువినోదమయ్యెడువాని॥పరికించవన్నా॥

శు ద్ధ సా వే రి అ ట తా ళం

అచలాత్ముడెటులుండుననగా। స్వామియన్నిటవుండిలేడనఘా॥ అచలాత్ముడునుసర్వమావరించిభువి। యెచటజూచిననేకమై తానెందుపొందనివాడతండు॥అచ॥

వాదభేదములేనివాడు। స్వామిగాధలేమియుచెందబోడు। ఆదితుదియుగాకనాకారమునులేక। నాదుబిందుకళాదులకునామీదనంటకయున్నవాడు॥అచలా॥

ఎన్నతరముగానివాడు। స్వామికన్నులలోనెయున్నాడు। మన్నుజలమువహ్నిమారుతమునుదాటి। యున్నమిన్నువనంటకనుగనుగొన్నచిక్కకయున్నవాడు॥అచ॥

ఎగువదిగువనుయుండబోడు। స్వామిమిగిలిప్రకాశమైనాడు। సగుణనిర్గుణములకుసాక్షిభూతుండునై। మిగిలిభావాభావములనెడతెగక నిండిచరించువాడు॥అచ॥

ఎందుజూచినలేనివాడు। రామానందయోగీంద్రుడైనాడు। పొందుగ

శ్రుతగిరియందుప్రకాశమై। అందముగవెలిగొండదాసునియాత్మలోనివసిం
చినాడు॥అచ॥

కం దా ర్థం  ము ఖా రి రా గం

ఎంతనిదెల్పుదుసీతా। కాంతునిశ్రీదివ్యపాదకమలములెపుడు। సంతో
షముచేమరువక। చింతలుపోజిమ్మువాడు॥ శ్రీగురుడన్నా। రామానంద
యోగీంద్రుడన్నా। దాంతుడైప్రకృతిగుణాంతుడైపరమసుశాంతుడై వెలుని
రంతరమునువాడు॥శ్రీగురుడన్నా॥

జే గ డ రా గం  అ ట తా ళం

బట్టబయలైయున్నబ్రహ్మమునీవయ్యేభావమేదోదెలియరా। మిట్టపల్ల
ములనుజుట్టుకనంతట। పట్టుగనున్నయాగుట్టుదేశికునిచే। యిట్టిదనుచును వె
లియవలయునురా। లోవెలుపలనుతానెట్టుకొనిధరపాదుకొన్నదిరా। మె
న్నాళ్ళకైననుబుట్టుచావునులేకయున్నదిరా। భూతములకాటపట్టునైతెగ
లకనెయున్నదిరా। దానినీవెరిగె। దిట్టమెరుగకయమునిచేతనుపట్టుపడికొ
రతనెట్టగనే। మట్టిపాలైమరలభువిలోబుట్టుటకునీకేలవట్టి॥బట్టబ॥

అందిందులేకనుయచలుడైయున్నయాపొందికదెలియుమురా। మెందు
బూచినసందుగొందులవెనుకను।ముందునిండియునెడసందేమిలేకదా।నుండి
దీనిపసందుదెలియుమురా।బాహ్యాంతరంబులయొందుతానైకదలకున్నదిరా।
రేబగలునొకాక-చందమైయది వెలుగుచున్నదిరా। సనకాదిమునివరులందు
పొందికనైయె మెలంగెనురా। దానినీవెరిగే। సందుదెలియకమందమతిచేబాం
ఛితయానందమునభ్రమ।జెందిసుఖదుఃఖములనెప్పుడునొందనీకేటికినివట్టి॥
బట్టబయ॥

అండపిండాండబ్రహ్మాండముతనలోననుండజేసెనుదెలియరా। ఎండ
మావులరీతినొందుగుర్తెరుగక। ఖండములైసూర్యమండలాంతరమందు। నిం
డుకొనియున్నదేదోగనరా। తనకంటెవేరైయుండువస్తువ లేకయున్నది
రా। రామయోగీశ్వరునండజేరియుదానిదెలియుమురా। శరణన్నగనివెలి
గొండదాసునుబ్రోచినదివినరా। దానినీవెరిగే। దండినెరుగకతిండిచేయీ
మొండివాదములాడితెలియనిరండలైతిరుగనేటిను వినుకొండనిలయుండైనవ
ట్టి॥ బట్టబయ॥

కం దా ర్థం  ఆ నం ద భై ర వి

పుట్టుటగిట్టుటలేకను। పట్టుగసచరాచరంబుబ్రహ్మముతానై। గుట్టుగ

సుండెడివెల్గును। యిట్టిదనుచు దెలియువాడె॥ యీశ్వరుడన్నా। వాడీలో కమెరుగబోడన్నా। గట్టిగనుదనమనసులోయీబట్టబయిలందు నెరుకెప్ప డు। ముట్టలేదనిగురుని చేమదిదిట్టపరచి మెలంగువాడే॥యీశ్వరుడన్నా॥

ఆనందభైరవిరాగం అటతాళం

పరమభక్తుడనీకుపట్టుగ జెల్పితిబ్రహ్మమిదేగనరా। యింతకువేరేపరికింపలేదాయె॥ తరుగుమరుగులేక తాను నేననబోక। పరిమాణమ్మును గాకపగలు రేయుచూడ। బురదకుమ్మరిపురుగునంటనికరణినై పదునాల్గుభువనములరయుతానైయుండి యెందుననంటకుండు నిరామయుండని॥ పరమ॥

వన్నెలేమియులేక వదరక బెదరక వర్తించుచున్నాదిరా। దానికిసాటై। యున్నవస్తువలేదురా। యెందుననిలువాకున్నదేదో జెలియరా। యోగులు మూడులోకన్నున వెదకిరిరా। అదిదెలియరా। మన్నుజలమువహ్నిమారుత మును దాటియున్నమిన్నుననంటకున్నవాడనిచూడ। వెన్నగాయగఘృతము చల్లకువేరుగావర్తించువిధమున। వెన్నతరమదిగాకలోజెలి చెన్నుమీరుని రామయుండని॥ పరమ॥

ఆదితుదియు గాక నాకారమును లేకనంతటయున్నదిరా। బిందుకళనాదముల్ గానిదిరా। యెందునముట్టబోదని దెలియుమురా। మిన్నైయింతపొదుకొనెనుచూడరా। అదిదెలియరా। మోదఖేదములనక మొనసిమూజ్జగములు। భేదమొందకకద్దులేదానగారాక। మీదిబొబ్బరచింతపండునుమిళితమును గాకున్నవిధమున। ఆదికినితానాదిమై తానచలుడైన నిరామయుండని॥ పరమ॥

పుట్టుగిట్టదిగాకభువిచరించుటలేకటూనుకయున్నదిరా। యెందునచూడముట్టబోకనియుందిరా। దానికిసందుపట్టులేకనెపొందెరా। వెతుకగనెందుమొట్టమొదలులేదురా। అదిదెలియరా। చట్టువలెనెయుండిక్షరమక్షరముగాకచుట్టుకయున్నయాగుట్టుదెలసిచూడ। గట్టిగను ముకురంబునందున కాంతులంటనిరీతిగనుగొన। వట్టిరైకదలకను నెదుటనివాసమైననిరామయుండని॥ పరమ॥

కామమోహములేక ఘనబ్రహ్మతగిరిజోకకదలకయున్నాదిరా। దలపగను నిష్కామముడైనిలచెనురా। దానికిమించనేమియులేదాయెరా। నిర్మలగుణధాముడై వెలసెనురా। అదిదెలియరా।నీమనిష్టకర్మనీతులుజపతప। హోమములకునంతర్యామియై చూడగ। రామయోగిబ్రహ్మముగుచునిరంతరము

వెలిగొండదాసుని। ప్రేమతోరక్షింతునని యెడిబిరుదుగల్గుని రామయుండని॥ పరమ॥

కందార్థం ముఖారి

మాయాప్రపంచమునందున। బాయక సంసారవార్ధిబడిదరిజేరక। జే యుగురునెరుగజాలక। కాయముస్థిరమనుచునమ్మి॥ గతిగానరైరీ। శ్రీహరి జేయుక్రమమరయరైరీ। వేయువిధములచేతసద్గురు। రాయునకు సేవలుఘటింపుచు। మాయగెలువగ గన్నవారికిమరలజన్మంబులేదనివిని॥ గతిదెలియరైరీ॥

మోహనరాగం అటతాళం

ఇదివట్టిమాయా। దీనికిమించినవిబ్రహ్మమాయా॥ అదియిదిగాకతుద మొదలేమిలేకసమ్మోదముగవర్తించునదిగానలేకను। ముదముతో నీషణత్రయములవదలకను పాశబద్ధుండై। కదలకను జెలువందుమదిగురుపదములనుగనుగొననివారికి॥ యిదివ॥

సాకారమాయా। యిదిమించినిరాకారమాయా। రాకపోకలులేనియేకస్వరూపమై ప్రాకటముగనున్నబయలని దెలియక। చీకటినిబడియింద్రియంబులజిక్కి కామాదులనుదగులుక। లోకవాసనచేతగురుకృపలేకభువినిచరించువారికి॥యిదివ॥

బిందునాదాయా। దీనికిమించుప్రియుడుతానాయా। ముందుగశ్రీరామానందయోగీంద్రుడై యెందుజూచినపరమానందుడై వెలసేడి। చందమెరుగక నెవుడుశ్రుతగిరియెందునను వెలిగొండదాసుని। అందముగబ్రోచేటిసద్గురునాత్మయందునగననివారికి॥ యిదివ॥

కందార్థం మోహన

ఇట్టిప్రపంచపుసౌఖ్యము। వట్టిదియనిదెలసిముక్తివాంఛితుడైతా। గట్టిగసద్గురుగనుగొని। పట్టుగసేవించువారు॥ భక్తులోయన్నా। వారేకర్మబడయబోరన్నా। పుట్టుగిట్టులేనిబట్టబయలువాని। గుట్టుగదెలసినిర్గుణులైనవారెల్ల॥భక్తులోయన్నా॥

శంకరాభరణం రూపకం

వందనమనరా। గురువరునితోసాటెవ్వరురా॥ వంద॥ ముందుగహరిపాదకమలమందుజేర్చినాడుగల్గు। సందేహముదీర్చిముక్తి। బొందగజేసెనునేడానందంబైయుండెనుమది॥వంద॥

వింతయైన ప్రకృతికినాద్యంతమెల్ల దెల్పిముక్తి। కాంతనుగనుగొనిపరమా। శాంతునిగా నెల్లప్పుడుసంతోషముజేసెనుమది॥వంద॥

నాదినీదియనుచుపట్టివాదములనుదగలకనుయ। నాదిమూలమైనవాని। పాదుదెల్పినీవెమియుకాదనిబోధించనుమది॥వంద॥

అందముగను శ్రీరామానందయోగీశ్వరుడై। యెందుజూడనందెనిలచి। యుందుసునీయెందునుబయలందూననుచుదెలిపెనుమది॥వంద॥

దండిగా శ్రుతనగపురినఖండంబైనిలచియువెలి। గొండాఖ్యునినెప్పుడు బ్రోచు। చుండెడిబ్రహ్మాండనాయకుండగనుచుంటినిమది॥వంద॥

కందార్థం శంకరాభరణం

పన్నగశాయినిమదిలో। సన్నుతిజేసెడివిధంబుసద్గురుకృపచే। తిన్నగ దెలసియుముక్తిని। గన్నట్టినరుండుమోక్ష॥ కాముడోయన్నా। వాడేచింతకలనెఱుగడన్నా। యెన్నతరముగాకయున్న పరాత్ముని। కన్నులలోపల గన్నవాడెమోక్ష॥ కాముడోయన్నా॥

కాఫీరాగం అటతాళం

చింతనీకేటికిరావె। ముక్తికాంతనుగూడితెకడతెరగలవే। చింత॥ వింతయైనమాయాకాంతముదెలసియు। అంతరాత్మునిమదినిరంతరమును నే।దంత తానైయుండుననిలత్స్యాంతరంబున నెరిగి పరమా। శాంతుడవునీవగుచుసద్గురుచెంత జేరగనవే॥చింత॥

అంటియంటకయుండగదవే। యామునకంటిలోపలయున్నఘనునిగన్గానవే। ఘంటనాదముతుదనంటి ప్రేమాయగ యెందునంటకుండయూరింటిపై తానే। వంటిస్తంభపుమేడలోపలనోలలాడుచునున్నసద్గురు। జంటబాయక నుండిసద్గతిజాడనీవదిగనవే॥చింత॥

అందిందులేనేలేదనవే। బ్రహ్మానందమయినిర్మలాకారమనవే। యెందుజూచినరామానందయోగీంద్రుడైముందునిలచిమోక్షముసగతాబూనె। చందమెరిగినయపుడె శ్రుతగిరి యందుననువెలిగొండదాసుడమందమగునానందమునునింపొందియుండెనువినవె॥చింత॥

హెచ్చుకందార్థం శంకరాభరణం

ఘనులగునిశ్చింతలవా। రనువుగ న్యాత్ములువచించిరాత్మనెరుకచే। జనన స్థితిలయమూలయి। తనువున కేగలుగునాత్మ॥ తగులబోదన్నా॥ తెలసిన ముక్తుడగుతన్నుగన్నా। మనమున నే చింతలనుమానిసద్భక్తులనుగూడిగురు

మర్మమును గన్నవారికి। వినక జనక నుకినుక లేకను వెనుక ముందును నటించబోకను। దినకరుని కాంతులకు మించిన దివ్యమంగళుడైన పరునికి॥ తగులబోదన్నా॥

కమాసురాగం అటతాళం

ఎందుకీ చింత నొందనీ కేల గోవిందుని గనఁగొనవే। మనసా వినవే॥ యెం॥ ముందుగ నిశ్చింత నొందుచు గురుపాదమందు నీమదిని జేర్చి। పూజలొనర్చి। అందరానటువంటి పదవిని బొందినీ వెల్లప్పుడు పదియూ। నందమొందుచు కష్టసుఖముల నొందక నుబ్రహ్మంబుగనవే॥ యెందు॥

తండ్రి శ్లోకం

ఋణానుబంధరూపేణ। పశుపత్నిసుతాలయః। ఋణక్షయేక్షయం యాంతి। కాతత్ర పరివేదన॥ అనియున్నది గాన

మోసపోక వికాసుడవై పరవాసుదేవుగనవే। మనసా వినవే। గాసిదీర్చు పరమకారణ గురుజేరి దోసిలొగ్గి నిలచి। యంజలిజేసి। ఆసవదలి యును పశుపత్నిసుతాలయాదులు ఋణములనిదెగ। దీసిపోవు సుతాది మోహములాసదా శివునవలగనదగు॥ యెం॥

తల్లి శ్లోకం

మృణ్మయానీచ భాండాని। బహురూపాని భిన్నవతు। భిన్నభాండ పరిత్యాగం। కాతత్ర పరివేదన॥ అనియున్నది గాన

చెప్పిపోదిక నెప్పుడే మానా శ్రీయఃపతిగనుగొనవే। మనసావినవే॥ తప్పక తను తాను దరచి నిర్మలముగ। నొప్పెడు గురుని జేరి। మోక్షము గోరి। గొప్ప కొద్ది నేక భాండము నొప్పవానిలో భిన్నభాండము। లెప్పటట్లను మన్నుగల తగనొప్పనే సంశయము నీకు॥ యెందు॥

భార్య శ్లోకం

ఇదం కాష్టమిదం కాష్టం। నదీతీరేచ సంగమం। సంయోగశ్చ వియోగశ్చ। కాతత్ర పరివేదన॥ అనియున్నది గాన

భోగమేటికె యేగతొ నీకు విరాగివై ప్రభుగనవే। మనసా వినవే। త్యాగివైనీవు సద్భాగవతులగని। సాగిలపడి మ్రొక్కుము। సద్గతిగనుము। వేగమైన ప్రవాహమునను వియోగ సంయోగంపు సమిధలు। బాగజీవుల కూడికలు నెడబాయుటలు ననపరుని గనదగు॥ యెం॥

దాసి శ్లోకం

ఏకవృక్ష సమారూఢ। నానాజాతి విహంగవతు। ప్రభాతేన విభా

తేన। కాతత్రపరివేదన॥ అనియున్నదిగాన

లోకవృత్తి నిపోకడబోకనిరాకారుగనుగొనవే। మనసావినవే। సాకార మందునిస్సంగుడైవిమలుడైయేకస్వరూపుడనుమః। స్వామినిగనుము। యే కవృక్షమునందుపక్షులనేకములునివసించుబరువిదు। నాకరణితనువులనిన మ్మినబోకచేపరమాత్మగనవే॥యెం॥

పుత్రన శ్లోకం

మాతులాయశ్చశ్రీకృష్ణ। పితాయశ్చధనుంజయ। అభిమన్యుహతం దృష్ట్వా। కాతత్రపరివేదన॥ అనియున్నదిగాన

అంతనాదనిసంతసించకనుశ్రీకాంతునిగనుగొనవే। మనసావినవే। విం తగజగముకాద్యంతమైనిలచితానంతరాత్మయగుచు। సాధులబ్రోచు।మం తుకెక్కినవారలైయభిమన్యునిల్పగలైరిహరినరు। లింతయునుకాలమనిదె లియుకోరంతలేనిపరంబుగనదగు॥యెం॥

మందబుద్ధికెయెందుకే శ్రీరామానందయోగిజేరవే। మనసావినవే। యెందుజూచినసందుగొందులవెనుకనుముందునుండుగన్గొనా। బ్రహ్మంబ న। అందముగవెలిగొండదాసునియందుభావాభావమైబలు। పొందికతోవె లిగేటిపరమానందరూపుడనుచుగనవే॥యెం॥

ఆరభి కందార్థం

సర్వాధిక్యుడవయ్యును। సర్వేశుడవయ్యుసర్వసాక్షియునయ్యు। స ర్వజగత్పూర్ణుడవై॥ సర్వానందంబులను గాంతువురా। నినుజేరినవారి। స ర్వభేదములవేద్రుంతువురా। గర్వచిత్తులకుగనుగొనరాకనిగర్వులకెల్లసఘు డమూర్తివై॥ సర్వానందంబులను గాంతువురా॥

కాంభోది రాగం ఆదితాళం

కల్లలోకములునీకుయిల్లాయెనువినరా। తిరుగా। మళ్ళిజన్మమేమిలేదు మరువబోకుమురా। గనరా। కల్ల॥ తొల్లిప్రహ్లాదాదిభక్తులెల్లముక్తిజెంది ఘనతోబెల్లభావాభావములలోకొల్లలాడెరా। తల్లియుదండ్రియుగురువు దైవమైయుండేటిమర్మ। మెల్లగురునిచేతగనినీయుల్లములోమరువకున్న। అ ల్లదుగోజగమెల్లపిండియెగజల్లినట్లు తానుళ్ళకైనా॥కల్లలో॥

గట్టిగానునీకుబ్రహ్మమిట్టివాడనుచుజెలసేబట్టుదెల్పితీసినీపట్టువదలకు రా। మట్టులేకనెపుడువానిముట్టుటాకెసందులేక। జుట్టుకొనియెందునతా బట్టబయలైనిండియున్న। గుట్టుమదినిబల్దిట్టపరచియేతట్టునీవులేనట్టుజూచి

నా॥ కల్లలోకా॥

కోరినీకూనిర్మలుండీతీరుసుండుననుచుదావుజేరిబోధజేసితియా। వారివి మవకురా। నీరుమన్నువాయువగ్నిసింధినయాకాశమెల్ల। మీరియుండిభూతములకాధారమై వెలుగుచున్న। నేరుమెరిగిపలుమారునెరుకతో చేర కుంతితావేరైయున్న॥ కల్ల॥

పంతముతోదుతనునిరంతరాత్మని నేడునీచెంతజూపితినినీవి। భ్రాంతిమానరా। వింతైమెనట్టిసంసారమంతయునుగడచిపరమ। శాంతుడవీవగుచుసర్వజగముతానైయున్నవాని। సంతతమునశ్చింతచేతనీవంతర్యామిగనచలుడవైనా॥ కల్ల॥

అందముగనుశ్రీరామానందయోగీశ్వరునికృపచే। నంది తెలసితీవిమదినీ సందియంవిడరా! ముందుగవెలిగొండదాసుడందితన్నుతానుగాంచి।మెందుజూడనీదివ్యపరమానందములోనిలచియున్న। చందమెరిగిదృఢమందిశ్రుతగిరినిబొందినట్టిగురునందుజేరునీ॥ కల్లలో॥

హుచ్చుకందార్థం శంకరాభరణం

పరిపూర్ణబోధతనలో। స్థిరముగగుర్తెరిగితన్ను దెలసినవారల్। మరలనుబుట్టుటకల్లని మెరిగించనుగురువరుండు॥ నిదినమ్మవేరా॥ యింతకుమీరినదిలేదువినరా। తరుగకవిరుగకమరుగింతలేకనే। కొరతరానట్టినిర్గుణమైనబోధను। కరతలామలకముగనీమదిగనుమనీకెచ్చోటదొరుకని। గురుతుదెల్పెనుదానినీవెమరకసద్గతినొందుటకునై॥ ఇదినమ్మవేరా॥

శ్రీరాగం ఆదితాళం

ఎక్కడజూచినయెక్కడెయింతకునెక్కువలేదనరా॥ గనరా॥చక్కగనెరిగేజాడనెరుంగక దిక్కులువిరిగేటకల్లను। చిక్కదుగాతామిక్కటమైభువిపెక్కువిధంబులవకటాజమైనది। ఠక్కునగనుగొనినికటముగనుతోదిక్కుజూచనిరుప్రక్కలతోడై॥ ఎక్క॥

పుట్టదుచావదుపుణ్యాలలో వెలిబూనుకయున్నదిరా॥ గనరా॥ పట్టుగసద్గురుభావాభావముగట్టిగదెలియనిగాడ్దెలకెల్లను। పట్టిదిగాయేతట్టుజూచినను నెట్టుకనంతటజుట్టుకొన్నదది। మెట్టిదొగనుగొన్నట్టివారికే। గుట్టుగమదిలోబట్టబయలుగా॥ ఎక్క॥

నాదినీదియనిభేదములేకయనాదిగయున్నదిరా॥ గనరా॥ ఖేదముచేతనువాదములాడుచుయేదనిబలికేమొద్దులకెల్లను। లేదుగతుదమొదలాదిగాకే

తను పాదుకొన్నదా మోదంబై ధర। సూది మోపసందే దనిమదిలో వేదాం
తులకు వినోదంబుగ తా॥ఎక॥

ఎందదు తడవదు వుండి లేదనక దండిగయున్నదిరా॥ గనరా॥ ఖండము
గాకన ఖండంబైనది రెం డెరుగని యూరండల కెల్లను। వుండదు గాగను చుండిన
నంతటనిండుకొని బ్రహ్మాండ నాయకుండుండగాను రెండుండక కన్నులపండు
గాను భువి తాండంబై తా॥ఎక॥

సందు లేక తొం రెందున గనుగొనసందె యున్నదిరా। గనరా॥ ముందుగ
రామానంద యోగి కృప నొందనట్టియూపందుల కెల్లను। పొందదు గా దృఢమం
దుచు శ్రీతగిరియందు నల్ల వెలిగొండ దాసుమది। జెంది నెల్గునీ చంద మెరిగి పెం
పొందు వారికానందము జేయుచు॥ఎక॥

## కందార్థం నాదనామక్రియ

గట్టిగ దేహేంద్రియములు। వట్టివియని దెలసి లోక వాసనలడచే। గుట్టు
గురువరుని చేతను। పట్టుగ దెలసినను ముక్తి॥ పరుడౌనోయన్నా॥ వానికితి
రుగ పాప మేడన్నా। యిట్టిదనుచు దాని మొట్ట మొదలుగని। చట్టువలె నుమది
చలనము లేకున్న। పుట్టు గిట్టుట లేక సర్వము బట్టబయలం దెరుక నెప్పుడు। ము
ట్టబోక నుచూడవార్థికి కట్టరీతిని తాను తానై॥ పరుడౌనోయన్నా॥

## మొదుకలకాంభోది అటతాళం

నిన్ను నీవుగ నిజ మెరిగుండిననీ వె బ్రహ్మము చూడరా॥ యెన్నతరముగా
క నెందున గలయక మన్ను మిన్నంటక మమత లేమియు లేక। సున్న సున్నను గల్పి
యే దెసపోక సుషుమ్న విజన్మలయముల। నెన్న డెరుగక తనకు దానైయున్న ని
ర్గుణ భావము నందున॥నిన్ను॥

వేదాంతుల కమది భేద మొందక సుయనాదిమూలంబాయెరా। పాదుగ
తుద మొదలేదైన దెరుగక। సూది మోపను సందు చాచిన లేకను। మోదమైప
దు నాల్గు భువన మూలాధరించుచునుండి సర్వం బేది నే నెరుగననియద్భుతవాది
వై మెప్పుడు నీమదిలో॥నిన్ను॥

పరమభక్తులు తమలో దరచి ముక్తి నిగో భావాజ్ఞులైనారురా। సరిగా
దు దాని కేచలనంబు లేదెవరి। నెరు[illegible]నియ్యాడు పలు జేమితలంపదు। స్థిరము
గా తానుండి నెం రెందర యనణుమాత్రంబునైనను। తరుగు లేక వెలుంగు నా
పర తత్వము ను నెరిగున్న నీలో॥నిన్ను॥

అందముగా రామానంద యోగీశ్వరుడని ఖ్యాతి నొందెనురా। సందేహ

ము సు లేక సకలప్రపంచమునందు నొండక యొందునచలుడైనవాని! చందము సు వెలిగొండదాసుడు పొందు పరచియు నెప్పుడుమదియం! నందమొందుడు శ్రుతగిరిని వెలుగొందుగతి రేబగలునీలో॥నిన్ను॥

కంబార్థం — ముఖారి

ధర్మాధర్మము దెలసియు నిర్మలుడైనట్టి గురునినిజరూపములో॥ మర్మము దెలసి ప్రపంచపు కర్మములను జిమ్మి ముక్తి॥ గాంచుమాయన్నా॥ యిది దెలసి తేఘను లౌదుర న్నా! చర్మవసనుని సఖుడు వైభవనిర్మలత్వము నొంది వెల్గెడు! మర్మ మెరిగియు పరమ భక్తులమహిమలను దలపోసి ముక్తి॥ గాంచుమా యన్నా॥

ముఖారి రాగం — ఆదితాళం

కంటికంటిసద్గురునీనా! కనులగంటి॥ కంటిని నేయారింటిపైనముక్కం టిలోననిష్కంటక మద్గురు॥ కంటి॥

సకలాత్మలలో సాక్షియు తానై! వికలంబొండక వెల్గెడుసద్గురు॥ కంటి॥

మందర మధ్యముమరి తారకములు! యందు ప్రణవరూపాంతరుడగు గురు॥ కంటి॥

ఎండవెన్నెలయునిండియుండగను! మెండుగచిత్కళ మెరుపులలో గురు॥ కంటి॥

అకారవుకారమకారములకా! దికారణుండై ప్రకాశించుగురు॥ కంటి॥

మేలినూటయెనిమిదితెరుపతులకు! మూలమైనసుర శైలమందుగురు॥ కం॥

గంగాయమునా ఘనసరస్వతుల! సంగమమున శ్రీరంగని మద్గురు॥ కం॥

అండపిండబ్రహ్మాండములను పర! మండలమందున ఖండునిమద్గురు॥కంటి॥

ముందుగరామానందయోగినై! యందునన్నుసానందమూర్తిగురు॥కం॥

దండిగాను వెలిగొండదాసునది! నందునట్టి మార్తాండతేజా గురు॥కం॥

కంబార్థం — శంకరాభరణం

చక్కరబొమ్మ రావినవే! గ్రక్కునషట్కమలములను గలదేవతలకు! మక్కువదీరగ దెల్పెద! నిక్కముగానమ్మియుండు॥ నీరజనేత్రి॥ ననుమరు వకేనిగమచారిత్రి! టక్కులనకనిరు [illegible] నారుసూర్లు! లెక్కహంసలనీ కువకంగ దెల్పెద॥నీరజనేత్రి॥

కన్నడ — అటతాళం

శ్రీలక్ష్మివినవె నామాట! నీకు జెప్పెదనే ముక్తిబాట॥ ఫాలభాగమున

ముమ్మూర్తులకోలనులోన। చాలువేయిస్తంభాలమేలుమంటపములో। వాం లాడుచునుండునను గనజాలరెవ్వరునీకు సేనా। కీలుదెల్పెద వేగ పరమసుశీల వైనను గాంచుమెల్లము॥ శ్రీలక్ష్మి॥

వారిరుహాక్షిరొవినవే। నాధారచక్రమునందుగనవే। తీరుగ వశషసా నాగవర్ణయుతంబై తిరిగినబీ రేఖలవారిజమున్నది। ధీరుడై విఘ్నేశ్వరుండా రూఢుడైయుండుందునతనికి। నారునూరుల ప్రణవమును విస్తారమై యర్పించుహంస॥ శ్రీలక్ష్మి॥

మానాత్రిజవనీరొవినవే। స్వాధిష్టానచక్రమునందుగనవే। మానినిమ బభమయరలాదులచేత। వీనవద్దళములవిలసిల్లుకమలము। దానిపైగలబ్ర హ్మదేవునకై నిరంతరమారువేలునౌ। హీనప్రణవ ధ్యానమర్పణబూనిజేయు చునుండుహంస॥ శ్రీలక్ష్మి॥

కనకదృశాంగిరొవినవే। దివ్యమణిపూరచక్రముగనవే। తనరినడఢణత థదధనపఫలచే। ననువొందుపదిరేకులలరినకమలము। ఘనుడు శ్రీవిష్ణుండు యాసరోజమునవెలుగొందునతనికి। ననయమునునార్వేల ప్రణవంబును సమర్పణజేయుహంస॥ శ్రీలక్ష్మి॥

శతపత్రగంధిరొవినవే। అనాహతచక్రమున వేగగనవే। వతలోకకఖగ ఘజఛరఝఞటఠ। ప్రతతితో పదిరెండుపత్రములైయుండు। వితతపుణ్యుడు శంభుడందునవెలసియుండుమహాత్ముడతనికి। సతతముననార్వేలప్రణవ ముచతురగతినర్పించుహంస॥ శ్రీలక్ష్మి॥

పరమకళ్యాణిరొవినవే। జీవపరమావిశుద్ధముగనవే। హరిణాక్షిటుపే చ్చోటఅఆలుపదియారువరగతితోనుండు పదియారురేకుల। నిరతమునుజీ వుండునచ్చోనిలచియుండునునికరమతనికి। గరిమతో వాకవేయుప్రణవంబ రయగానర్పించుహంస॥ శ్రీలక్ష్మి॥

సదమలగాత్రిరొవినవే। రమ్యస్థలమునాజ్ఞేయముగనవే। పదవితోడు తహంక్షంవర్ణములనుగల్గి ఇదురుగరెండురేకులుగల్గి జెలువొందు। మఃది తయాకమలంబుపైనింపొందవసుండినయాత్మకును సమ్మోదముతో దుతవేయు ప్రణవమునరసతో నర్పించుహంస॥ శ్రీలక్ష్మి॥

క్షీరసాగరపుత్రివినవే। సాహస్రారచక్రమునందుగనవే। కూరిమితో రామునుడనానాకువెయి। మూరులప్రణవమేమరకనర్పించుము। చారుశ్రీ కుశిశైలపురవరసౌధమునసాకారుడనునే। కోరికతొ వెలిగొందబ్రాసుని

సారకృపరక్షింత్రుచుందును॥ శ్రీలక్ష్మీ॥

ఆరభి కందార్థం

తారకసాంఖ్యములనుమది। దీరగతత్వంబులెన్నిదెల్పుటకైనే। సాకేత నిసురమ్మానుమని॥ కూరిమితోడబిలచితిరావే॥ శ్రీరామానందగురువరుడను చునమ్మితోవె। సారహీనసంసారిజలధికడతేరలేక్రువేసారిసుఖముకై॥ కూరిమితోడబిలచితిరావే॥

శుద్ధసావేరిరాగం అటతాళం

శ్రీనిత్యసంకల్పశేషాహివృదుతల్పచేరినామనవివినవే। వాసవార్చితచి ద్విలాసుడవనిదాసదాసులునిన్నాత్మదలచినుతింతురు। వాసిమీరగనిక్రునను నెడబాసియుండగజాలవోపర। వాసుదేవజగంబులెల్లనుజేసినావనినిన్నునుర లునుడాసి। మానులుమ్రొక్కుచుండగబూచి। వారికోర్కెసఫలముల్జే సి। మోక్షమునొందించితివనిదోసి। లొగ్గితినిక। భాసమానవిలాసవాకిక పరమతత్వరహస్యమునుదయజేసనినునెడబాయకుండెడిచిత్సుఖాధిసిబాం దజేయుము॥ శ్రీసత్య॥

పరమకళ్యాణిశ్రీపరభృతసుతవాణివచియింతునిదివినవే। స్థిరముగభు విపరాత్పరుడనొక్కండనై। ధరవిలాసముచూడదలచినిమస్రృజియించి। వ రుసనీసంబంధమునయీవహిచతుర్దశభువనములు సత్వరతతోజనియించె ననిమదినరయలేకనిజంబటంచునికోరి। మోహముల్బెదిగుసుచువారి। పా పములచేనరకముల్జేరి। నన్నెరుగనేరరెసుకుమారి। మదినిగోరి। గురునిశ్రే పైతారకంబనునదిగురునెరింగిమనోవికారము। లరసిద్రుంచియులక్ష్యమును నాయందునిల్పిసుఖంబుగనవే॥ పరమ॥

కందర్పజనకనీచందమిట్టిదనిసానందుడెందైనను। పొందుగ తెలియ లేరందురునామదియందునిల్పెదనెనీసుందరమహిమను। యీందుమండనరాశ పర్వమునందునిండితివంద్రుబుధులర విందలోచననీమహత్యమునందునమప దునాల్గుభువనములందూ। భూతములసృష్టించితివందు। కర్త్రిలైజనులు లయాందు। పోషకుడవైవిలసిల్లినందూ। చేతనుమది। బొందెసికసాఖ్యంబునం దునముఖ్యమగుతత్వములనిర్ణయ। పొందజేసియునిర్వికల్పానందమునవ న్నికనుజేర్చవే॥ శ్రీసత్య॥

చంచలాక్షిరొవినుమించెదనీతత్వమంచితముగవినవే। పంచభూతముల జయించివిషయములద్రుంచిషడ్గుణములవంచనజేసియు। గాంభీరికసాధ్యా

రకమలముగడచిద్విదళాబ్జమునప్రణవరబంచితము ఘూర్మిల్లపీనులవించువే
గకసుంగొనదురనియుందు। నీమదిలోనన్నుదలంచు। చుండగసంచితములం
టకంటు। నమ్మ్యముచిత్ప్రకాశుడనంచు। దలంచుము। యెంబళక్యముగాని
పదవిలభించుననినీయాత్మలోదృఢముంచి రేబగలాకట్టిగధ్యానించిపరము

స్వామినన్నికవేరుసల్పకనేరములక్షమియించిబ్రోవగదే। తామసరహి
తసీశ్రీమన్నారాయణనామముదలపోసినరుతెల్లభువిలోన। స్వామివానినెన్నె
రుగజాలకసత్యసంసారాంధులైదా। మేమిగానకపామరులునైతాముమే
మునిత్రభ్రాంతిచేతనునీమ। హాత్మ్యముతెలియవశమెనిపాకా। నన్నునుగావు
మికమేఘశ్యామ। క్రొమొకదకరుణించుగుణధామ। సార్వభౌమ। నేరుదును
నీపాదయుగళసుతామరసములమరువసికనీ। నామమంత్రమునంగిదయనా
పామరత్వమునడచిబ్రోవుము॥ శ్రీసత్య॥

పూనివినవెతుకవాణి నాపల్కులుపూబోణివినుపించెదా। జ్ఞానవేద్యుడ
సిత్యానూనవైభవుడనై। మానసవాక్కాయధీనుడగాకుండి। శ్రీనివాసుడ
ననుచుమదిలోధ్యానమొందెటిహనుమదాదిమహానుభావులుమాయనెల్లను
పోవడచివానిజమెరింగిరిచాన। అట్టిదివేగనీయాత్మలోన। నిల్పుము వేగదెల్పి
తిగాన। దుర్భమలొందనెన్నడటులైన। ముక్తిదెచుస। యూనిరామానంద
మునినైపొందుగశ్రుతనగపురంబున। దీనుడగువెలిగొండదాసుని మానసం
బుననిల్చివెల్గుదు॥ పరమకళ్యాణి॥

కందార్థం ముఖారి

అకటావినవేనడే। దకటకనేబోవవెంటదిరిగియున్నకే। టక్కరి
చేయుచుమండెడి। చక్కనివాడెవరోవీని॥ జాడదెల్పగదే। వీనికినెవరుసా
టిలేరుగదే। మక్కువతోడనేవొక్కడనైనీకు। పక్కతోడైయున్నపరమా
త్మనినాతో॥ పెక్కువిధములబలికినెవరికిజిక్కకనుమొందెందుభక్తులు।
క్రొమెక్కుచుండినవారిమదిలోనిక్కముగనుందునసుజాసి॥ జాడదెల్పగదే॥

కేదార ఆదితాళం

కన్నులారగజూచితిరాఘనుడుమొవ్వరెలకటరో। తిన్నగానాసాగ్రి
మందున్నదేవుడేచెల్లెలా॥ కన్ను॥

చెవులైతేటిరులందుతిరుగుచేమెలకటరో। నీవునేననభేదమేదనినిజము
దెల్పవెచెల్లెలా॥ కన్ను॥

నిజముదెల్పవానికి తెమేసీతియుండునెఅక్కరో। అజపమనేమంత్రముత నయాత్మనుండునెచెల్లెలా॥కన్ను॥

మంత్రములచేతవానిమహిమలేవెఅక్కరో। తంత్రకాడైజగముకెల్లతా రకుండెచెల్లెలా॥కన్ను॥

తారకుండైయున్నవానిదలచుటెట్లోఅక్కరో। కోరికలెల్లమానినిగా లువవలెనేచెల్లెలా॥కన్ను॥

కొలువుజేతామన్నవానిగురుతుయేదనెఅక్కరో। నిలువనీడలేనిచోట నిజమెరుంగవెచెల్లెలా॥ కన్ను॥

నిజమెరుంగనువానితోటినెళవుయెట్లుగునక్కరో। భజనపరులనుగూడి యున్నపట్టుదొరుకునెచెల్లెలా॥కన్ను॥

పట్టుదొరికిననేమునాతోపలుకునటవెఅక్కరో। ఆ। గుట్టురామానంద యోగిగురునిగన్గొనుచెల్లెలా॥కన్ను॥

గురునిగన్గొనిశ్రుతగిరీశునిగూడువారెవరక్కరో। ధరణిలోవెలిగొండ దాసుడుదావుజేరెనెచెల్లెలా॥కన్ను॥

కందార్ధం మోహన

జనస్థితిలయములకును। ఘనుడై తానున్నయట్టిక్రమమెరుగకనీ। మనమ్మున నసంశయమొందుచు। కనుపాపలనున్నవాని॥ గనుగొనవేరా॥ నీకునుము క్తిగలుగునువినరా। వినికనుదానినాశనముగావించిదా। ప్రణవస్వరూపు డౌబ్రహ్మమైవెలసెను॥గనుగొనవేరా॥

కాఫిరాగం ఆదితాళం

అందరానిముక్తి కన్నులందెగలదుచూడరా। ఆచందమెరిగియున్నజనన మొందవెన్నడైనరా॥ అంద॥

ముందుగాశ్రీగురునిపాదమందునీదుమనసునెపుడు। పొందుపరచియు న్నబ్రహ్మానందమైవెలసేవురా॥అంద॥

లోకలోకరూపుడైతానేకమాయచూడరా। ఆపోకడగనుగొన్నవారి పొందుమరువబోకురా॥అంద॥

శోకభోకలేకసర్వమేకమైయున్నట్టివాని। ప్రాకటముగగన్ననీవేపరుడ వైవెలసేవురా॥అంద॥

గుట్టుగతెనలోనెచూడబట్టబయలైనాడురా। ఆపట్టుదెలసియున్నవా రిపాదసేవజేయరా॥ అంద॥

పట్టుతలేకచలకను సర్వఘటాంతర్యామిని। గట్టిగనీవెరిగియున్న ఘనుడ
వై వెలసేవురా॥ అంద॥

ఆది శాంత్యమేమిలేకయచలుడైయున్నాడురా। ఆ। వేదాంతుని దెలసిన
ట్టి వేత్తలతో గలయరా॥ అంద॥

రాకపోదు లేదనక భేదమొందుచుతానుండే। లేదనిబల్కినసంతర్వేది వై
వెలసేవురా॥ అంద॥

పందు వెన్నెలరీతిని నిండుకయున్నాడురా। అంద జేరితను తా దెలిపేయా
చార్యుని జేరరా॥ అంద॥

దండి రామానందయోగి దయచేత వినుకొండపైని। నిండియున్న హరినిమ
ది వెలిగొండదాసుగాండరా॥ అంద॥

కందార్థం ముఖారి

పందతనంబున ప్రకృతివ। డందగుశక్తి నిఘటించుటకు దెల్పెదని। స్పందేహ
ము గారామా॥ నందమునీంద్రుం డెపరుడో॥ నంచునమ్మమురా। నీవాపరు
నియందు జెందుమురా। సందియమున యోగులెందరో భ్రష్టేరా। చందమొం
దక నీవానందమునో పరుడో ॥నంచునమ్మమురా॥

శంకరాభరణం అటతాళం

భగవంతుడితడెగన్గొనరా। నీలోపరికించి తెలసితె బ్రహ్మమాదువురా॥
భగవం॥ పొగరుచేతను ఇంద్రియంబులదగులుకొని పాశబద్ధుడవై। పగలు
రాత్రి రినెవుడునీచవు మగువలను గూడి చెడనేలను॥ భగ॥

మతభేదముల నెంచకుమురా। సమ్మతముగనుండేటి మాన్యులగవరు।
క్షితిని జననం బొంది పాపము జేసిసుఖదుఃఖముల రెంటిన। వెతలబొందుచునుం
డితను తావివర మెరుగకను చెడనేలను॥ భగ॥

పట్టినిందలజోలివిడరా। దీనిగుట్టు దెలసియున్న గురుని జేరుమురా। పట్టు
గా సంసారవారధి బడి మునుంగుచు దేలుచునుతుద। ముట్టకను ఈషణత్రయ
ములజొట్టుకొని నీవు చెడనేలను॥ భగ॥

చపలత్వమును విడువవేరా। యాకపటనాటకుడైనఘనుని వేడుమురా।
పాపము లెందుచునుండి పెద్దల నిందజేయుచుయముని చే పరితపింపుచు నరక
కూపంబునదవిలి దుఃఖమున చెడనేలను॥ భగ॥

పామరత్వము నీవు వీడరా। నిన్నే రామనందయోగి రక్షించువినరా। తా
మసంబును మాని శ్రుతగిరిధాముడై వెలిగొండదాసుని। ప్రేమతో రక్షించుప

ద్గురుబిరుదెరుంగకనుచెడనేలను॥భగ॥

కందార్థం ఆరభిరాగం

దాసుడపతితుడదీనుడ। నీసరిలేరనుచునమ్మికరభుక్తి। దోసిలియొగ్గిభవత్కృప॥ కాసించినాడవేగరారా। నిన్నేదువనంచుబాసజేసితిజగదాధారా। వాసవాదిసురవర్ణితమౌనీవాసిజూపినాగాసిదీర్తువని॥యాసిం॥

ముఖారిరాగం అటతాళం

కరుణజూడుమునన్నుశ్రీసద్గురువరానీపాదములను। స్థిరముగా। నామదిమరువగా॥కరుణ॥

ధూతకోటికినెల్లనీవునుధాతవైప్రఖ్యాతినొందిన। రీతిగా। కనుగొనుప్రీతిగా॥ కరు॥

సారసాత్వుడవనుచుబుధులువిచారమునసేమరకమదిలో। గోరిరి। శరణనిజేరిరీ॥కరు॥

ఎంచశక్యముగాకనీవునుమించియున్నదిభక్తులెల్లను। గాంచిరీ। నినుసేవించిరీ॥ కరు॥

మోక్షదాయకయీజగంబులరక్షకుడవైవెలసియున్నది। దీక్షతో। గంటినపేక్షతో॥కరు॥

అంటియంటకనీవుతోడైయుంటివనిశ్రుతులందుబలుకుట। వింటిగా। నినుకనుగొంటిగా॥కరు॥

పట్టుగాసచరాచరంబులబ్రహ్మమైనీవున్నజాడను। గట్టిగా। తెలసితిగుట్టుగా॥కరు॥

పొందికైరెండుచెందురామానందయోగీశ్వరుడవనిమది। యెందునూ। దలచుచునుందును॥కరు॥

దండిగావెలిగొండదాసునికండమైశ్రుతగిరినినీవై। యుండగా। కన్నులనిండుగా॥కరు॥

ఆరభి కందార్థం

కనుగొనశక్యముగాకను। జననస్థితిలయమునీవుజెందకయెంతో। దునజూడనిండుకొనివే॥ రునుగాకనిలచియున్నావూర।నీసేవజేయుఘనులెల్లముక్తినొందేరూరా। మనమునసెప్పుడనుదినమునుమరువకనినుప్రార్థించియుగనువారికివే॥ రునుగాకనిలచియున్నావూర॥

మధ్యమావతిరాగం ఆదితాళం

అదుగో శ్రీరామచంద్రుండదుగో। ఋషియొకమనుచున్నా॥దదుగో॥
అదుగో రాముడనివిదువక దలచిన। కదుభక్తులకునుకుడి యెదమలవా॥ద॥
భూతములకుసంప్రీతిగ నెప్పుడు। మేతనీళ్ళిడుచుఖ్యాతిగొన్నవా॥ దదు॥
ఆరుమీరిసాహస్రారమునందున। శేరియుప్రణవాకారుడైనవా॥దదు॥
వాటముగానుత్రికూటమునందున। మేటిగనిలచిననాటకుడౌవా॥దదు॥
బాగుగసీతాభామామణితో। భోగమొనర్చెడిపుణ్యపురుషుడ॥ల్లదుగో॥
పంచకళలకునుమించియుతానై। వెంచేసినశ్రీకాంచనచేలుం॥డదుగో॥
యింటిమంటికినినంటక నెపుడర। గంటియెందు నెందంటకున్నవా॥ దదు॥
అండపిండబ్రహ్మాండంబునుదా। నిండివెలుంగునఖండమూర్తి అ॥ ల్లదు॥
రాకపోకలును లేక సర్వమును। గాకవెల్గుయాలోకరక్షకుం॥దదు॥
పొందుగరామానందయోగినై। యెందుజూడగనుముందునున్నవా॥ద॥
దండిగానువెలిగొండదాసునకు। నండగశ్రుతగిరినుందుహరియుతా॥న॥

కందార్థం శంకరాభరణం

ఎక్కడజూచినతనయిరు। ప్రక్కలతోడైనవాడెబ్రహ్మాంబనుచున్। గ్రక్కునమదిలోనమ్మిన। యెక్కువనికనేమిగలదో॥ యెరుగుమాయన్నా। యెందునజూడనేమిలేదన్నా। ఒక్కడైకదలకపెక్కుపోకలబోక। పిక్కటిల్లుచుసర్వదిక్కులయందున। మిక్కుటంబై యుండికరములజిక్కకనుసచరాచరంబుల। నొక్కరీతినివెల్గుచుండెడి। చక్కనీసద్గురునినీలో॥ నెరుగుమాయన్నా॥

అష్టపది॥ నీలాంబరి॥ ఆదితాళం

శ్రీనివాసుడవనుచునినుమదిజేర్చి వేడుచునుంటిరా। దానవాంతకనన్ను బ్రోవను దైవమేనీవంటిరా। ఘననినునగనుగొన్నవారలపొందు నేనికమరువరా। కానిలేరాశ్రుతనగపురిప్రకాశశ్రీరామేశ్వరా॥శ్రీని॥
తల్లియునుదండ్రియునుగురువును దాతనేనీవంటిరా। కల్లగాదికవినుము నేనీకరుణకును పాత్రుండరా। తొల్లిప్రహ్లాదాదిభక్తులతోడునీవనివింటిరా। చల్లగానన్నేలుశ్రుతగిరిస్వామిశ్రీరామేశ్వరా॥శ్రీని॥
సారసాక్షుడవనుచు నేనీజాడగనుగొనుచుంటిరా। కోరినినుధ్యానించువారితోకూడియున్నదివింటిరా। భారకర్తవుగాకచేలునిపావనునిజేసితివిరా। నేరమెంచకునన్నుశ్రుతగిరినిలయశ్రీరామేశ్వరా॥శ్రీని॥

ఎక్కడనుజూచిననునీవని యెవ్వరునుగనలేరురా। నిక్కముగసద్బుధులునినుగనినిజమెరుంగుటవింటిరా। ప్రకృతితోడైయున్ననినునాభావములోగనుగొంటిరా। గ్రక్కునసుదయజూడుశ్రుతగిరిఘనుడశ్రీరామేశ్వరా॥శ్రీ॥

ఆదియంత్యములేకనీవునాదిరూపుడవంటిరా। పాదుకొనిసచరాచరంబులబ్రహ్మమైయున్నావురా। వేదవేద్యుడటంచుశ్రుతులనువెలయుచున్నదివింటిరా। వాదమేలనురారశ్రుతగిరివాసశ్రీరామేశ్వరా॥శ్రీజ్ఞా.ని॥

అంటియంటకనీవునంతటనచలుడైయున్నావురా। మింటిమంటికిసూత్రధారిగమెలగుచున్నదినీవెరా। కంటిలోవెలినంటకనునిష్కళయెనీవనిగంటిరా। జంటబాయకునిన్నుశ్రుతగిరిస్వామిశ్రీరామేశ్వరా॥శ్రీజ్ఞా.ని॥

పుట్టుగిట్టుటలేకసర్వముబూనుకొనియున్నావురా। యిట్టిదనినినుదెలియువారలకెందునీవైనావురా। గుట్టుదెలసెనునేదుశ్రీసద్గురునికృపగన్నానురా। దిట్టపరచితిమదినిశ్రుతగిరిదేవశ్రీరామేశ్వరా॥శ్రీజ్ఞా.ని॥

అండపిండాండములకునుబ్రహ్మాండమైయున్నావురా। నిండిరామానందయోగివినీవెమైవెలసితివిరా। అండగనువెలిగొండదానునియాత్మనీవైనావురా। దండివాడవులేరశ్రుతగిరిధామశ్రీరామేశ్వరా॥శ్రీజ్ఞా.ని॥

భక్తినీయష్టకముచదివినభక్తులనుపోషించరా। సక్తిమీరగనిహపరంబులస్వామికృపతోనియ్యరా। భక్తవత్సలనాదువిజ్ఞాపనముదయచేకొనుమురా। శక్తిసహితవిలాసశ్రుతగిరిస్వామిశ్రీరామేశ్వరా॥శ్రీజ్ఞా.ని॥

కందార్ధం ముఖారి

శ్రీఅందముగాతానంతట। పొందికమైయున్నజాడపుణ్యాత్మకులై। ముందుగగనుగొనముక్తిని। జెందెదరనిదెలియువాడే॥ శీలుడవునన్నా॥ సద్గురుచెంతజేరగగన్నా। ముందువెనుకయెడసందేమిలేక పెంపొందుదానిమదియందునగనుగొన్న। అందరానటువంటిబ్రహ్మానందమునరేబగలునోకాచందమునవెల్గేటిరామానందయోగీశ్వరునిజేర॥ శీలుడవునన్నా॥

మేలుకొలుపు ధూపాళం ఆటతాళం

లేరనీసరివారులేరనిమదిలోనకోరిసేవించితిలేరా। భారకర్తవుగానాభావములోపరబ్రహ్మమైయున్నావులేరా॥ రామమేలుకోరా॥

పంచభూతములప్రపంచమంతటనీవుపట్టుగయున్నావులేరా। సంచితములులేనిసాధులలోవెలిసాక్షినీవైనావులేరా॥ రామమేలుకోరా॥

వాదభేదములేకవసుధలోనన్నిటవర్తించుచున్నావులేరా। ఆదికినాది

వైనవతరించితివనిచాచార్యుడెరిగించలేరా॥ రామమేలు॥

ఆకాశమునుజలమునందుజూచినచిత్రములదినీవుగాబోవులేరా। లేకజూచిననంతి నేకమైయున్ననిరాకారమూర్తివిలేరా॥రామ॥

మందబుద్ధిమానిమరినిన్నుజూచేటిమరుగునేగనుగొంటిలేరా। అందిపొందకసర్వమంతటవెలసినయచలుడవనిగంటిలేరా॥రామ॥

సూటిగనిన్నుయెచ్చోటజూచిన గానితేటగాయున్నావులేరా। కోటిసూర్యులకన్నమేటివైనరగంటిభాటలోయున్నావులేరా॥రామ॥

ఎరుకచేతనిన్నుపరికింపవలెనన్న యేవస్తువునుగావులేరా। యెరుకమీరినిన్నుయెరిగేటివారికియెదుటనేయున్నావురా॥రామ॥

కోరికతోవినుకొండపట్టణమందుకూరిమినున్నావులేరా। చేరిరామయోగిసేవనేజేయుచుస్థిరపరచియున్నానులేరా॥రామ॥

అండపిండబ్రహ్మాండములెల్లనునిండియున్నావటలేరా। దండిగవెలిగొండవాసునకునునీదుదర్శనమాయెనులేరా॥రామ॥

హె చ్చు కం దా ర్ధం  శం క రా భ ర ణం

లోకంబులుతనలోపల। ప్రాకటముగదాల్చినేడుబ్రహ్మముతానై। యేకాకృతినివెలింగెడు। శ్రీకాంతునిగన్నవాడే॥ శ్రీగురుడవురా॥ వాడేరామయోగీశ్వరుడురా। సాకారమునభక్తజనులకునెల్లనిరాకారుడితడనిపోకడదెల్పను। యేకరూపముదాల్చియేమిటసోకకనుయెందెందుతానై। గాకయున్నపరాత్ముడితడనిలోకులెన్నగవెలసియున్న॥ శ్రీగురుడవురా॥

యా ల॥  యె దు కు ల కాం బో ది  అ ట తా ళం

శ్రీరామానందయోగీశా। శ్రితజనభక్తహృదయేశా। చారుశ్రీసత్స్వరూపవేశా। వోరామయోగీంద్రా। సరసజేర్చుమురజగదీశా॥శ్రీరా॥

ఆంతారంగామందుననీ। రంతరముమరువకనీ। చెంతజేరివేడుభక్తునీ। వోరామయోగీంద్రా। సంతతముబ్రోవవేబూని॥శ్రీరామా॥

పట్టుగానీవైజ్ఞగమంతా। బట్టబయలైయున్నవింత। గుట్టుగాదెలసితినేనంతా।వోరామయోగీంద్రా। కోరితీనిరావేనాచెంతా॥శ్రీరామా॥

పంచాభూతములకునీవు। మించియున్నానీదుతావు। గాంచిననీవెందునలేవు। వోరామయోగీంద్రా। పంచజేరియున్ననుగావు॥శ్రీరా॥

ముందువెనుకానీవులేకా। యుందువనేనీదుజోక। విందుదెలసేమరువనిన్నికా। వోరామయోగీంద్రా। అందముగనన్నేలుమికా॥శ్రీరా॥

అంటియంటకనన్నేడ। జంటబాయకనుడుడా। వంటిగానునీవునాతో
డా। వోరామయోగీంద్రా। వుంటివనిమరువనీజాడా॥శ్రీ॥రామా॥
లోకాలోకామందుననీ రాకారస్వరూపుడనీ। యేకమనసుతోడనే
బూని। వోశ్రీరామయోగీంద్రా। ప్రాకటముగనిన్నేగంటనీ॥శ్రీరా॥
ముందుగాను నేడురామా। నందయోగీశ్వరునిప్రేమా। నొందకముక్తి
నినెరిగేమా। వోరామయోగీంద్రా। పొందుగామననన్నేలుమా॥ శ్రీరా॥
దండిగవిన్నాండలోనూ। నిండివెలిగొండదానును। దండిజేర్చిబ్రోవానీవే
నూ। వోరామయోగీంద్రా। దావుజేరిమ్రొక్కితినేనూ॥శ్రీరా॥

వచనము.

శ్రీరంగని పాదారవిందములయందుబుట్టినగుంగ్గకమ్మమహాప్రవా
హముగనుంగొని వర్ణించిన కీర్తన.

తేవారము శహనరాగం

వాసవార్చితతమేశ। వరదపాతకవినాశ। దాసమానసవిలాస। తరణి
నిర్జితవిభాస। భూసురావనసుశీల। భుజగపరియంకలోల। భాసితశ్రుతిగిరి
శ। పాహిమాంజానకీశ॥

కమాన్ రూపకతాళం

రంగనీకృపనాకుగలుగు। గంగాదారిణ్యావే శ్రీ॥రంగ॥ అంగజజనకుండై
మునివుంగవులను బ్రోచిన శ్రీ॥రంగ॥
మత్స్యరూపమునను జలధిజొచ్చిసోమకాసురుని। గ్రుచ్చివేదములను వేగ
దెచ్చియజునకిచ్చిన శ్రీ॥రంగ॥
నిర్మలుడైసురలకెల్లనిక్కమ్ముదయనమృతమిచ్చు। కూర్మరూపమునను జల
ధికుండగాచరించిన శ్రీ॥రంగ॥
కోపమునను కనకనేత్రుకుంభిణిజుట్టగవరాహ। రూపమును ధరించివాని
రూపుమాపుజేసిన శ్రీ॥రంగ॥
సారెకుప్రహ్లాదుడుమదిగోరివేడనరమృగావ। తారమెత్తినఖములచే దై
త్యునిబరిమార్చిన శ్రీ॥రంగ॥
బాలకుడైబలినిమూడు పాదములనుగోరియూ। వేళనింద్రుముజ్జగములకే
లికగావించిన శ్రీ॥రంగ॥
నీమముచేతక్షత్రియులనెనామముగలవారినిబలు। తామసమునద్రుంచిప
రశురాముడనజెలంగిన శ్రీ॥రంగ॥

దనుజశాఖలకుసుర మునిఘనులు వేడ గాదశరథ। తనయుడై జనించి దైత్య తతులనువంశాడినశ్రీ॥రంగ॥

భావమందు నెవ్వడునుదృఢభక్తి నిడన పాదములను। సేవకులగువారిఘనుల జేయుట కైబలుడగు శ్రీ॥రంగ॥

శుద్ధమానవసుమనశోభ నొంగుడై వెలుంగు। బుద్ధరూపుడనగభువన పూజితుడై వెలిగెను శ్రీ॥రంగ॥

కలియుగమున కెల్లతానుక ల్కిరూపమునుధరించి। ఖలులశిక్ష జేతునని కాంక్షతో వెలింగెడు శ్రీ॥రంగ॥

పరమపవిత్రవసినిన్నుభక్తితో శ్రీసాధుమాదాది। వరులెల్లనుహరికుమారి వనినిను ప్రార్థింతురు శ్రీ॥రంగ॥

అందముగను శ్రీ రామానందాయోగీశ్వరు కృప। నొందియున్న భక్తుని యెడసందేహం బేలను శ్రీ॥రంగ॥

తరుణకొశ్రుతగిరిపురీశుదయచే వెలిగొండదాసున। కథ వేలను దారినివ్వ వమ్మాగుండ్లకమ్మా శ్రీ॥రంగ॥

మాలిని శహన

పరమపదవిహారా। భార్గవీచిత్తచోరా। సురనరవరసేవ్యా। సుస్థిరాహ్లాదభావ్యా। తరణివిజితతేజా। దానవాబ్జాతరాజ। వరశ్రుతగిరిఖేలా। పాహిమాంలక్ష్మీలోలా॥

శ్రీ రామానందగురుబ్రహ్మణేనమః।

భైరవిరాగం ఝంపెతాళం

శ్రీ దాయకంబునై వెలువొందువశవసల। పొదుకొనిమరి నాల్గుపత్రములనూ। మేదినీతత్వమూలాధారచక్రమున॥

ఓంసహస్రశీర్షాం దేవంవిశ్వాక్షంవిశ్వశంభువమ్। విశ్వంనారాయణం దేవమక్షరంపరమంపదమ్। విశ్వతఃపరమాన్నిత్యంవిశ్వంనారాయణంగ్ హరిమ్। విశ్వమేవేదంపురుషస్తద్విశ్వముపజీవతి। పతింవిశ్వాస్యాత్మేశ్వ రంశివమచ్యుతమ్॥

వేదవిదుడైపట్టివిష్ణుపతికీ॥ జయమంగళంనిత్యశుభమంగళం॥

ఆరయగబభమయరలనువర్ణములగూడి। యారుదళములను చెన్నలరుచుండి। తీరుగానమరుస్వాధిష్ఠానచక్రమున॥

నారాయణంమహాజ్ఞేయంవిశ్వాత్మానంపరాయణం। నారాయణపరోజ్యోతిరాత్మానారాయణఃపరః। నారాయణపరంబ్రహ్మంతత్వన్నారాయణఃపరః। నారాయణపరోధ్యాతాధ్యానంనారాయణఃపరః। యచ్చకించజ్జగత్సర్వందృశ్యతేశ్రూయతేపివా। అంతర్బహిశ్చతత్సర్వంవ్యాప్తనారాయణస్థితః అనంతమవ్యయంకవిగ్ంసముద్రేంతేంవిశ్వశంభువం॥

భారతీపతియైనబ్రహ్మకిప్రదూ॥జయ॥

దనరారుచున్నపదిదళములనుడఢణలను। తథదధలనపఫలనుదగిలివెలుగూ। మణిపూరకమునసిర్మలకాంతిశ్రీలక్ష్మి॥

పద్మకోశప్రతీకాశగ్ంహృదయంచాప్యధోముఖం। అధోనిష్ట్యావితస్త్యాంతే। నాభ్యాముపరితిష్ఠతి। జ్వాలామాలాకులంభాతివిశ్వస్యాయతనంమహత్। సంతతగ్ంశిలాభిస్తులంబత్యాకోశసన్నిభం। తస్యాంతేసుషిరగ్ంసూక్ష్మంతస్మిన్ సర్వంప్రతిష్ఠితం। తస్యమధ్యేమహానగ్ని। ర్విశ్వార్చిర్విశ్వతోముఖః॥ నెనసియుండినవిఘ్నేశునకును॥జయ॥

తనరుద్వాదశదివ్యదళములనుకఖగఘఙ। లనుచఛజఝఞటఠలనుగి। ఘనయనాహతచక్రమునపార్వతీదేవి॥

సోగ్రభుగ్విభజన్ తిష్ఠన్నాహారమజరఃకవిః। తిర్యగూర్ధ్వమధశ్శాయిరశ్మయస్తస్యసంతతా। సంతాపయతిస్వందేహమాపాదతలమస్తకః। తస్యమధ్యేవహ్నిశిఖాఅణీయోర్ధ్వావ్యవస్థితః। నీలతోయదమధ్యస్థాద్విద్యుల్లేఖేవభాస్వరా॥ నెనయుశ్రీరజితాచలేశ్వరునకు॥జయ॥

స్వరుసతోపదియారువర్ణంబులఅల। ధరియించుపదియారుపత్రములనూసరవితోడవిశుద్ధచక్రాగ్రమునజేరి॥

నీవారశూకవత్తన్వీ। పీతాభాస్వత్యణూపమా। తస్యాశ్శిఖాయామధ్యేపరమాత్మావ్యవస్థితః। సబ్రహ్మస్సశివస్సహరిస్సేంద్రస్సోక్షరఃపరమస్వరాట్। రాజాధిరాజాయప్రసహ్యసాహినేనమోవయంవైశ్రవణాయకుర్మహే। సమేకామాన్ కామకామాయమహ్యంకామేశ్వరోవైశ్రవణోదదాతు। కుబేరాయవైశ్రవణాయమహారాజాయనమః॥ యిరువుగావెలుగొందునీశ్వరునకు॥జయ॥

తనరిహంక్షంబనెఘనవర్ణములగూడి। యును రెండుపత్రములనుచితముగుడు। మొనయునాజ్ఞాచక్రమునవినిర్మలరూప॥

ఓంతద్బ్రహ్మఓంతద్వాయుఃఓంతదాత్మా।ఓంతత్సత్యంఓంతత్సర్వంఓంత

త్పురోర్ణవః। అంతశ్చరతిభూతేషుగుహాయాంవిశ్వమూర్తిషు। త్వంయజ్ఞస్త్వంవషట్కారస్త్వమింద్రస్త్వగ్ంరుద్రస్త్వంవిష్ణుస్త్వంబ్రహ్మాత్వం ప్రజాపతిః। త్వంతదాపఆపోజ్యోతీరసోమృతంబ్ర। హ్మాభూర్భువస్సువరోం॥ మనసుకైకనిపట్టునాత్మకిలితమా॥జయ॥

వలనైనఆకగలనువర్ణములజెలువొంది। లలినొప్పువేయురేకులుగల్గినా। జ్వలితసాహస్రారచక్రంబునవసించి॥

అద్వైతంవిష్ణవేచతుర్మూర్తిర్వ్యాపతియజ్ఞోవైవిష్ణుఃయజ్ఞఏవాంతతఃప్రతితిష్ఠతి సూత్రజుహోతివిష్ణవేస్వాహాయజ్ఞాయస్వాహా। ప్రతిష్ఠాయైస్వాహేతి।ఈశానస్సర్వవిద్యానామీశ్వరస్సర్వభూతానాంబ్రహ్మాధిపతిర్బ్రహ్మణోధిపతిర్బ్రహ్మాశివోమేఅస్తుసదాశివోం॥ వెలుగొండుగురురాజవీరునకునూ॥జయమంగళంనిత్యశుభమంగళం॥

ధారుణినిశ్రుతశైలధాముడైవెలిగొండదాసుబ్రోవగనెంచిదనువుగాంచీ। చారుతరసత్కృపాసాంద్రుడైవెలిగొండు। శ్రీరామయోగీంద్రశేఖరుడా॥జయమంగళం॥

పూర్ణం

## శ్రీగురుభ్యోనమః

శ్రీకరవికారివత్సరాశ్వీయుజశుక్ల। దశమిస్థిరవాసరమునందుదారోశేమ। యోగివర్యాంకితంబుగానొనరదీని। పరిసమాప్తంబుజేయగాబడెమేధరణీ॥

## శ్రీరామానందగురుబ్రహ్మణేనమః